వేదవిజ్ఞాన ఛారిటబుల్ ట్రస్ట్ ద్వితీయ పుష్పం

# ప్రాచ్యపాశ్చాత్య జ్యోతిషాలు








జ్యోతిషకేసరి, జ్యోతిర్వైద్యరత్న, జ్యోతిషకళారత్న

డా॥ సి. వి. బి. సుబ్రహ్మణ్యం

ప్రథమ ముద్రణ - 2000
ప్రతులు - 2000



వెల - 60-00

ప్రచురణ

**సత్యసాయి గ్రంథమాల మరియు**

**వేద విజ్ఞాన ఛారిటబుల్ ట్రస్ట్**



ప్రతులకు

**సి.వి.లక్ష్మి**

సాయి జ్యోతిర్వైద్య పరిశోధనా కేంద్రం
101, స్వాతికుటీర్, యూసఫ్‌గూడ,
హైదరాబాద్ - 500045. ఫోన్ - 3734999

**శ్రీ గోపాల్ పబ్లికేషన్స్**

3-3-860, ఆర్యసమాజ్ మందిర్ ఎదురు సందు,
కాచిగూడా ఎక్స్ రోడ్స్, హైదరాబాద్ - 500027.

ముద్రణ

**విజయభారతి ప్రింటర్స్**

ఆగాపురా, హైదరాబాద్ - 500 001.
ఫోన్ : 4732313, 4734714

# అర్పణ



"పనికిరాని పనుల కొరకు పాడయ్యెను కాలము
దక్షిణాన యముడేమో సవరించెను గాలము"
అలా కాలం వ్యర్ధం కాకుండా
ఇలాంటి ప్రయత్నాలు సదా కొనసాగాలని
నాకు ప్రేరణయైన సాయీశునికి
భక్తి సుమంగా.

# **కృతజ్ఞత**

గ్రంథ ముద్రణలకు తరచూ చేయూతనిస్తూన్న

**గౌ॥ శ్రీ జి.వి. అంశుమాన్** గార్కి

కృతజ్ఞతలతో

**డా॥ సి.వి.బి. సుబ్రహ్మణ్యం**

# స్వపరిచయం



తల్లిదండ్రులు : వ్యాకరణ విశారద, గీతా వ్యాఖ్యాతృ చక్రవర్తి సువర్ణ ఘంటాకంకణ భూషితాద్యనేక బిరుదు బాజనులు, రాష్ట్రపతి సన్మానము నందినవారు కీ.శే. చిఱ్ఱావూరి అనంత పద్మనాభ శాస్త్రి గారు, శ్రీమతి సుబ్బలక్ష్మి గారు.

గురువులు : తండ్రిగారు మొదలగువారు.

పట్టములు : భాషాప్రవీణ, ఎం.ఏ (సంస్కృతం), ఎం.ఏ (తెలుగు), పి.హెచ్.డి.

ఇతర విద్యలు : వ్యాకరణ, వేదాంత జ్యోతిశ్శాస్త్రములు

కృషి : జ్యోతిష సాహిత్యాలలో పరిశోధన, కవిత్వం, భారత రామాయణ, భాగవతాదులపై ప్రసంగాలు, జ్యోతిర్వైద్యం ద్వారా అనారోగ్యాలను నివారించడం.

**బిరుదములు** : **ఆస్థాన జ్యోతిష పండితుడు, జ్యోతిషకేసరి, జ్యోతిషకళారత్న**, హంపి విరూపాక్ష పీఠాధిపతి అనుగ్రహించినవి, **జ్యోతిర్వైద్యరత్న** - స్టార్ ఆస్ట్రాలాజికల్ రిసెర్చి సెంటర్ మరియు జ్యోతిష పరిషత్తు - హైదరాబాదు వారు ప్రదానం చేసినది. **జ్యోతిష కళానిధి, జ్యోతిష విజ్ఞాన భాస్కర**, యూనివర్సల్ రిసెర్చి ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఏస్ట్రో & అకల్ట్ సైన్సెస్ హైదరాబాదు వారిచ్చినవి.

**జ్యోతిష మహామహోపాధ్యాయ, జ్యోతిషమనీషి** -ఏషియన్ ఏస్ట్రాలజర్స్ కాంగ్రేసు కలకత్తా వారిచ్చినది.

సన్మానాలు : 1. ఉగాది పురస్కారం (1996) ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం వారిచే

2. కాస్మోపాలిటన్ ఎంప్లాయీస్ కల్చరల్ అసోసియేషన్ (1997)

3. ఉగాది పురస్కారం పురపాలక సంఘం సదాశివపేట (1998, 2000), రామగుండం, 2000,

ఉద్యోగం : జ్యోతిశ్శాస్త్రోపన్యాసకుడు, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం.

విదేశీ పర్యటనలు : అమెరికా, హాలెండ్, లండన్, సింగపూర్.

ఇతర రచనలు : జ్యోతిష పరిచయం
విదేశాలలో జ్యోతిషోపన్యాసాలు
ప్రాచ్య పాశ్చాత్య జ్యోతిషాలు
జినేంద్రమాల వ్యాఖ్యానం
హోరాసారం-తెనిగింపు
జైమిని హృదయం
ఆనందకల్పవల్లి-ఆనందామృతవల్లి

రాబోవు రచనలు : భృగు సంహితాసారం
జ్యోతిర్వైద్యం
జ్యోతిష ప్రసంగాలు
సహేతుక జ్యోతిషం.

నివాసం : 101, స్వాతికుటీర్, యూసఫ్‌గూడ,
హైదరాబాదు - 500 045.
ఫోన్ : 3734999

# ఇందులో

# పాశ్చాత్య జ్యోతిషం

సకల జీవులు ఆనందాన్ని కోరుకుంటాయి. ఇంద్రియాల సుఖాల వల్ల కలిగే ఆనందం దుఃఖమిళితమై వుంటుంది. దుఃఖము లేని ఆనందం కోసం అందమైన భవిష్యత్తు కోసం ఆలోచనలు గల మానవుడు ప్రయత్నం చేస్తూ వుంటాడు. ఆనందానికి, దుఃఖానికి - నవ్వుకి, ఏడుపుకి భాషలు లేవు, దేశాల ఎల్లలు లేవు. పున్నమి నాటి వెన్నెల, సూర్యుని లేత కిరణాలు, ఉత్తేజాన్ని ఇవ్వని జీవి లేదు. పశుపక్ష్యాదులు పొందే అనుభూతితో సమానంగా ఆది మానవుడు ఆకాశంలోని కాంతులను చూచి ఆనందించడం ప్రారంభించాడు. తన నిత్య కృత్యాలను క్రమబద్ధం చేసుకొనే ఆలోచనను ఆరంభించాడు. ఆ ఆలోచనా ప్రారంభమే కాంతితో ఆరంభమైంది. మిగిలిన జంతువుల కంటే మానవుని ఔన్నత్యానికి పునాదిరాయి అయింది. ఆలోచనతో ఆకాశాన్ని దర్శిస్తూ విశ్రాంతినీ, ఆనందాన్నీ పొందుతూ దిక్కు, దేశం, కాలం అనే వాటి జ్ఞానానికి సహజ కాంతులనే ఆధారం చేసుకున్నాడు.

కాంతి, ఆనందానికి అవ్యక్తమైన సుఖానుభూతికి, ఆలోచనా వికాసానికి కారణమౌతోందని గుర్తించాడు. ఒకే కాంతి ఎల్ల వేళలా స్థిరంగా ఉంటే ఆలోచన ప్రేరేపించబడేది కాదేమో! ప్రకృతికి చలనం సహజ లక్షణం. అదే మార్పుకు దారి తీస్తుంది. అదే ఆలోచనను రేకెత్తిస్తుంది. వచ్చే పోయే కాంతులను లెక్కపెట్టాలని ఆలోచన ప్రారంభమై గణిత శాస్త్రానికి నాంది పలికింది. తనకున్నవి ఐదు వేళ్ళని లెక్కపెట్టడం ఆరంభించాడు. మూడుఐదులు అయ్యేటప్పటికి పూర్తి చీకటి నుండి చంద్రుని పూర్ణబింబాన్ని చూచాడు. మరల మూడు ఐదులు అయ్యేటప్పటికి పూర్తి చీకటిని చూశాడు. చంద్రుని వృద్ధిక్షయాలు ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించాయి. వాటిలోని క్రమత ఆలోచనను రేకెత్తించింది. మళ్ళీ 15 రోజులకు పూర్ణబింబం కనిపిస్తుందని భవిష్యత్తు ఊహించాడు. అది నిజమైనది. చాలా ఆనందించాడు. తన ఊహకు

ప్రాణం పోసుకున్నాడు. భవిష్యత్తులో ప్రకృతిలో జరిగే మార్పులకు ప్రస్తుతం ఆకాశంలో కనిపించే కాంతులు కారణమౌతుంటాయి అని గుర్తించాడు. ప్రకృతిపై ప్రభావం చూపే ఈ కాంతులు వ్యక్తిపై ఎందుకు ప్రభావం చూపించవు? అనే ఉత్సుకత మానవునిలో ప్రవేశించింది. అదే జ్యోతిష శాస్త్రానికి శుభోదయం అయింది. ఆ భవిష్యత్తు తెలుసుకోడానికి లెక్కలు అవసరం వచ్చాయి. ఈ లెక్కల శాస్త్రం జ్యోతిషం కంటే వేరైనది కాదు. వేరుగా లేదు. అందుకే గణితజ్ఞుడు అనే పేరు జ్యోతిష శాస్త్ర వేత్తకు మరో పేరైంది. ఈ లెక్కలు, ఈ ఖగోళం, ఈ ఆలోచన లేని మన నిత్య జీవనాన్ని ఊహించగలమా! ఆ గణితమే తర్వాత కాలంలో పలు విజ్ఞాన శాస్త్రాలకు తల్లి అయింది. ఈ లెక్కను చూస్తే జ్యోతిషం 'సకల మాత' అనవచ్చును. అందుకే సకల దేశాలలో కాంతి చొరబడిన చోటల్లా జ్యోతిషం ప్రధమ విజ్ఞాన శాస్త్రమే అవుతూ వచ్చింది.

ఖగోళ శాస్త్రాన్ని మాత్రమే శాస్త్రమని జ్యోతిషం శాస్త్రం కాదని భావించే వారు కొందరున్నారు. కాని, మానవ జాతిలో భవిష్యత్తు తెలుసుకోవాలనే కాంక్ష దానికి ఆకాశంలోని కాంతుల ఆధారమనే భావన నిత్య సత్యము. నిరపేక్ష సత్యము. అందుకే నిత్య జీవనంలో ఇమిడిపోతూ ఇప్పటి పరిస్థితులను పరిశీలించడం ద్వారా భవిష్యత్తును సూచించగలవాడు దివ్యజ్ఞానం కల వ్యక్తిగా గౌరవించబడుతూ వచ్చాడు. అట్టి మేధావులనే ఋషులని, యోగులని సమాజంలో ఉన్నతులని పేర్లు వేరైనా ఉత్కృష్ట వ్యక్తులుగా అన్ని సమాజాలు గుర్తిస్తూనే వచ్చాయి. ఆలోచనే ధ్యేయంగా ఫలసిద్ధే లక్ష్యంగా గల ఈ మేధావి భౌతిక సుఖాలకు ప్రాధాన్యం ఇవ్వని వ్యక్తిగా రూపొందినందువలన సమాజం వీరికి ఎక్కువ గౌరవం ఇస్తూ వచ్చింది. ఆ గౌరవాన్ని సంపదగా భావించడం వలన భౌతిక సంపదలను కోరకుండా సమాజానికి ఒక గురువుగా, మేలు కోరేవాడిగా గుర్తించబడ్డాడు. నిస్వార్థభావన వలన సత్యద్రష్ట కాగలిగినాడు. ఇలా గౌరవం సత్యదర్శనం ఒకదానినొకటి పోషించుకుంటూ ఈ జ్యోతిషం ఉత్కృష్టతను సంతరించుకున్నది.

ప్రస్తుతం లభ్యమయ్యే వాఙ్మయంలో అతిప్రాచీనమైనదిగా గుర్తించబడినది ఋగ్వేదము. అది అలా గుర్తించబడుటకు మూలాధారాలు - ఆ ఋగ్వేదమందున్న జ్యోతిషాంశాలే కావడం గర్వకారణమే. అందుకే ఋగ్వేదం యొక్క అతి ప్రాచీనతను సకల దేశాల మేధావులు అంగీకరించారు. అందున్న విషయాలు సమీక్షిస్తే జ్యోతిషాంశాలే ఎక్కువ శాతం కన్పిస్తాయి. ఋగ్వేదంలో కనిపించే జ్యోతిషాంశాలలో లోతైన విషయాలు పరిశీలిస్తే వేద కాలానికి ముందే జ్యోతిషం అధిక స్థాయిలో వికసించిందని అర్థమవుతోంది. నిజానికి జ్యోతిషాంశాలు నిత్య జీవనంలో అందరికి అత్యవసరమైనవే. పగలు, రాత్రి ఒకదాని వెంట ఒకటి వస్తున్నాయి. వీటిని లెక్కించడం కాలగణన. వందల కొద్దీ లెక్కించడం కష్టం. అందుకే విభజన అవసరమైంది. చంద్రుడు ఒకసారి పూర్తిగా కనిపించడం, ఒకసారి అసలు కన్పించకపోవడం వాటిని పూర్ణిమ - అమావాస్యలుగా గుర్తించడం కాలగణనలో మరో మెట్టు. అదే మాసాల పరిగణన. ఋతువులు ఒకే వరుసలో రావడం ఎండలు, వర్షాలు, చలి పునరావృతం కావడం ఈ ఆవృత్తి 12 మాసాలలో పూర్తి కావడం దీన్ని గమనించడం మూడవ మెట్టు. అదే సంవత్సర గణన. వసంతం, వర్షం, హేమంతం, శరత్ అనే సంవత్సర నామాలు ఋతువుల ఆధారంగా ఏర్పడినవి. అబ్దం అంటే నీరు ఇచ్చేది అని అర్థం. దానికి మేఘమనే అర్థం ఒకటి. సంవత్సరం అనే అర్థం ఒకటి ఉన్నాయి. వేసవిలో నీటికి కటకటలాడి వర్షాలు ఎప్పుడు వస్తాయి అని ఎదురుచూచే మానవుడు అవసరం కొద్దీ లెక్కలు కట్టుట కట్టడం ప్రారంభించాడు. ఇది బలవంతాన ఏర్పడిన ఆలోచన. అదే మనోవికాసానికి విజ్ఞానాభివృద్ధికి దారి తీసింది. వర్షానికి పంటలకి ఉన్న సంబంధం వల్ల నీరే జీవనాధారం అవుతూ జీవమనే పేరుని కూడా పొందింది. ఋతువుల ఆధారంగా ఏర్పడే సంవత్సరానికి చంద్రుని వృద్ధిక్షయాలపై ఆధారపడి ఏర్పడే మాసాల లెక్కల ద్వారా వచ్చే సంవత్సరానికి ఉన్న స్వల్ప భేదం ఇంకా ఆలోచనను వికసింపజేసింది. అప్పుడినుండి రోజు, నెల, సంవత్సరం అనే గణన ఆరంభమైనది. ఆ మూడింటి సమన్వయం కోసం ఖగోళ పరిశీలన

తీవ్రతరమైంది. నేటికి మనం తేదీ, నెల, సంవత్సరం అనే వరుసలోనే గుర్తిస్తున్నాము. ఆకాశంలో చంద్రుడు సంచరించే మార్గంలో గుర్తులు తెలియడం కోసం నక్షత్రాలను మైలురాళ్ళుగా గుర్తుపెట్టుకోవడం వాటికి ఆకృతులను కల్పించుకోవడం - వాటిని పాత్రలుగా చేసుకొని కథలల్లడం ఆ కథలు పూరాణగాథలుగా విస్తరించడం అన్ని దేశాలలోనూ జరిగిన వికాసమే.

భారతీయ దృక్కోణంలో పేర్లు వేరైనా ఆకృతులను బట్టి ఏర్పరచుకున్న నామాలు అన్ని దేశాలలోనూ దగ్గర పోలికలు కలిగి వున్నాయి.

దిక్, దేశ, కాలాల పరిజ్ఞానం లేకుండా ఏ పనీసాగదు. వ్యక్తి తన పూర్వానుభవాన్ని బట్టి, వర్తమాన కాలంలో ఆలోచన చేసి భవిష్యత్తుకు బాట నేర్పరుచుకుంటాడు. ఆ విధమైన ఆలోచనే, భవిష్యత్తును తెల్సుకోవాలనే కాంక్ష, భవిష్యత్తును ఉన్నతంగా మార్చుకోవాలనే పట్టుదలే, మానవుని వికాసానికి కారణమైనది. సకల జీవులలో మానవుని ఉన్నత శ్రేణికి చెందిన వానిగా తీర్చిదిద్దింది. దేశ దేశాల సంస్కృతిని బట్టి మార్గాలు వేరైనా మూలరూపం ఒక్కటి అని గుర్తించక తప్పదు. ఈ ఖగోళ పరిశీలనలను ఆధారంగా చేసుకొని దేశం యొక్క ఔన్నత్యాన్ని అంచనా వేయడం గమనించవచ్చు. మధ్య అమెరికావారి మాయా నాగరికత గొప్పదని వారి శాసనాల ద్వారా తెలుస్తోంది. ఖగోళ విద్యలో వారు అఖండ పండితులు. వారి శాసన భాష, లిపి పూర్తిగా అవగాహన కాక పోవడంవల్ల వారి ప్రతిభ యొక్క పూర్తి విశిష్టతను తెల్సుకోలేక పోతున్నాము. ఆ మాయా నాగరికత సూర్య సిద్ధాంతంకంటే ప్రాచీన మైనదని, సూర్య సిద్ధాంతంలో శ్రోతగా వర్ణింపబడిన మయుడు ఆ జాతివాడేనని కొందరు అభిప్రాయ పడుతున్నారు. ఆ అభిప్రాయాన్ని మనం పరిగణనలోకి తీసుకుంటే ఇతడు ఋగ్వేదకాలానికి ముందు వాడుకాలేడు.

ఈజిప్టుకు చెందిన నైలునదీ నాగరికత ఖగోళ శాస్త్రానికి పుట్టినిల్లు

అని కొందరు అభిప్రాయ పడుతున్నారు. అయినా వారి కాలం క్రీ.పూ. 3000 నుండి 4000 వరకే (చూడు విజ్ఞాన సర్వస్వం 9వ సంపుటము 68వ పేజీ), చైనావారు గ్రహణాల విషయంలో అపార ప్రజ్ఞను సంపాదించారు. ఆ గ్రహణ నిర్ణయాన్ని ఖచ్చితంగా చేయలేని జ్యోతిష్కులకు చైనా రాజులు మరణ దండన విధించేవారట'' - (విశ్వ రూపం - నందూరి రామమోహన్ రావు 22వ పేజీ). వారి ఖగోళ విద్యా కృషి క్రీ.పూ. 4000 నాటిది. ఈ చారిత్రకాంశాలు పరిశీలిస్తే వేదకాలం వీటన్నింటి కంటే ముందుదని అర్థమవుతోంది. ముందు వెనుకలు ఎలా ఉన్నా విజ్ఞానం విషయంలో ఎల్లలుమరచి ఆదాన ప్రదానాలు జరుగుతూనే వచ్చాయి.

సమస్త జీవజాలం యొక్క ఉత్పత్తికి, స్థితికి, సూర్యకాంతి అత్యవసరం. అయినట్లుగా సమస్త విజ్ఞాన వికాసానికి జ్యోతిషాంశాల సహకారం అత్యవసరం. వ్యవసాయం వర్షాలపై ఆధారపడింది. చదవడం, వ్రాయడం రాకపోయినా వ్యవసాయదారునకు జ్యోతిష విజ్ఞానం అత్యవసరం. వారి సామెతలు పరిశీలించినా ఎన్నో జ్యోతిషాంశాలు దర్శనమిస్తుంటాయి. ఓడను నడిపే వారు తామున్న ప్రదేశాన్ని గుర్తించడానికి ప్రయాణ మార్గాలు నిర్దేశించుకోడానికి నక్షత్రాల పరిశీలన చేసేవారు. నీడనుబట్టి పగలు, నక్షత్రాల స్థితిని బట్టి రాత్రి సమయాన్ని గుర్తించడం జరుగుతూ ఉండేది. రేఖా గణితం కూడా గ్రహాల దూరాలను గుర్తించడానికి వికసించిన విజ్ఞానమే. వ్యక్తి ఆనందాన్ని కోరుకుంటాడు. ఆ ఆనందం కోసం విషయాలను అనుభవిస్తుంటాడు. ఆ విషయానుభవం శృతి మించినప్పుడు అనారోగ్యం ఏర్పడుతూ ఉంటుంది. ఆ అనారోగ్యాలను గుర్తించడం, తొలగించడం వైద్యుని బాధ్యత. ఆ వైద్యుడు రోగనిర్ధారణ, రోగ నివారణలలో జ్యోతిషాన్ని ఉపయోగించుకోవడం ప్రాచీన కాలం నుండి వస్తోంది. మానసిక రోగుల రుగ్మత పూర్ణిమ అమావాస్యలతో ముడిపడి ఉండడం, నేర ప్రవృత్తి, ప్రమాదాలు, అదే

రోజులలో ఎక్కువ జరగడం ఆధునిక పరిశోధకులు కూడా అంగీకరిస్తున్న వాస్తవం. తన భవిష్యత్తును నియంత్రించుకోవాలన్నా, ఉత్తమంగా మలచుకోవాలన్నా ఈ శాస్త్రం ఉపకరిస్తూనే ఉంది. ఇలా మానవుని సర్వతోముఖాభివృద్ధికి జ్యోతిషం కారణమవుతూ బహుముఖంగా విస్తరించింది. మానవుడు సుఖమయ జీవితాన్ని కోరుతూ భవిష్యత్తును గూర్చి తెలుసుకోవాలనే ప్రయత్నం చేస్తున్నందువల్ల ఆశా జీవి కావడం వల్ల జ్యోతిషశాస్త్రంలోని ఫలితభాగం విస్తృతి చెందింది.

దేశ దేశాలలో విస్తృతి చెందిన ఈ జ్యోతిష అంశాలు అవగాహన చేసుకోవడం ద్వారా ఈ శాస్త్ర వినియోగాన్ని పెంచుకోవచ్చును. పాశ్చాత్య జ్యోతిషంలోనూ, భారతీయ జ్యోతిషంలోనూ ప్రాథమిక అంశాలలో భేదములున్నట్లు కన్పించినా పరిణతాంశాలు ఏకీభవిస్తూనే ఉంటాయి.

ఏ వృత్తాన్నైనా 360 డిగ్రీలుగా భావించుట జరుగుతోంది. ఆకాశంలో గ్రహాలు సంచరించే మార్గాన్ని క్రాంతివృత్తం అంటారు. దానినే 12 రాశులుగా విభజించారు. ఈ విభజనకు మూలాధారం మాసాల పరిగణనే. ఈ పన్నెండు రాశులుగా విభజించడం పాశ్చాత్య జ్యోతిషంలోను, భారతీయ జ్యోతిషంలోను జరిగింది. కాని మేషారంభ బిందువు రెండింటిలోను కొంతతేడా కలిగి ఉంది. ఉత్తరాయణ, దక్షిణాయణాలు అనే విభజన సూర్యుని గమనంలో కన్పిస్తోంది. భారతంలో భీష్మాచార్యుడు ఉత్తరాయణంలో మరణించాలనే సంకల్పం కలవాడై మాఘశుద్ధ ఏకాదశి వరకూ నిరీక్షించాడు. అతని పేరుతో భీష్మైకాదశి ప్రసిద్ధి చెందింది. సూర్యుడు కుంభంలో ఉండగా సంభవించే రథసప్తమి ఉత్తరాయణానికి ఆరంభంగా ఏర్పడిన వ్రతదివసం. అంటే ఆనాడు ఉత్తరాయణం, కుంభంలో సూర్యుడుండగా ఆరంభమయ్యింది. వరాహ మిహిరుని కాలం నాటికి సూర్యుని మకర రాశి ప్రవేశం ఉత్తరాయణం ఒకేసారి జరిగేవి. దానితో మకర ప్రవేశము ఉత్తరాయణ ప్రారంభంగా పరిగణించడం జరిగింది. తరువాత కాలంలో కాలక్రమంగా ఉత్తరాయణం ధనస్సులో

సూర్యుడుండగానే జరుగుతూ వస్తోంది. ఉత్తరాయణ ఆరంభంతో సమానంగా మకర రాశిని కూడా జరపడాన్ని ''సాయనరాశి పద్ధతి'' అంటారు. దాన్ని పాశ్చాత్యులు అవలంబించారు. నిరయన రాశి పద్ధతిని భారతీయులు అవలంబించారు. రాశ్యారంభ ప్రదేశాలు వేరైనా రాశుల క్రమం మాత్రం ఒక్కటే. ఆయారాశులలో సూర్యునియొక్క స్థితిని ఆధారం చేసుకొని వ్యక్తి లక్షణాలను పాశ్చాత్య జ్యోతిషం నిర్దేశిస్తోంది.

**మేషం :–** ఇది క్రాంతి వృత్తంలో మొదటి రాశి. శిరస్సుకు ప్రతీక. ఈ రాశికి కుజుడు అధిపతి. ఈ రాశిపై గాని రాశ్యాధిపతిపై గాని గ్రహాల దుష్టదృష్టులంటే శిరస్సుకు సంబంధించిన అనారోగ్యం కల్గుతుంది. ఇది చరరాశి. గతిశీలమైనది. ఈ రాశిలో సూర్యుడుండగా జన్మించినవారు ప్రయాణాలయందు ఇష్టం చూపుతారు. కార్యసాధనలో చురుకుదనం వహిస్తారు. ఔన్నత్యాన్ని సాధిస్తారు. ప్రతీ పనిలోను ఎక్కువ ప్రయాసపడతారు. ఉత్సాహము, రజోగుణము, అధికంగా కల్గి ఉంటారు. కృషిశీలత, సంచారము, స్ఫురణశక్తి, నాయకత్వ లక్షణాలు కలిగి ఉంటారు. ఇది అగ్నితత్వరాశి. శరీరంలో ఉష్ణశక్తిని, క్రియాశీలతను, అభివృద్ధికి కావలసిన పట్టుదలను కలిగి ఉంటారు. ఈ రాశి చిన్న రాశి. దాని వలన ఈ రాశికి చెందినవారు సామాన్యంగా పొట్టివారుగా ఉంటారు. ఈ రాశికి చెందిన రంగు ఎరుపు, ఎరుపురంగు వస్తువులపై ఈ రాశి ప్రభావం అధికంగా ఉంటుంది. క్రొత్త విషయాలు తెలుసుకోవాలనే ఆశక్తి, అధికమైన పట్టుదల, ఆటంకాలను ఎదుర్కొని ఎదురునిలిచే శక్తి కలిగి ఉంటారు. స్పష్టమైన లక్ష్యాలు ఏర్పరచుకోవడంలోను వాటిని సాధించడంలోని ప్రజ్ఞ కలిగి ఉంటారు. వారి మానసిక స్థితి నిశ్చితమైనదిగా ఉంటూ తమ లక్ష్యం నుండి చలించనిదిగా ఉంటుంది. ఎదుటవారిని ఆకట్టుకొనే ధోరణిలో వీరి ప్రవర్తన ఉంటుంది. దానివల్ల చక్కని నాయకత్వ లక్షణాలతో ఇతరులకు మార్గ దర్శకులవుతూంటారు. ఆదర్శవంతమైన ప్రవర్తన కలిగి ఉంటారు. త్వరితంగా నిర్ణయాలు తీసుకోవడంలో, ఉత్సాహ శక్తిని చూపించడంలో

వీరికి వీరే సాటి. ఎదుట వారిని అంచనా వేయడంలోనూ, ఇతరులకు కార్య నిర్దేశం చేయడంలోనూ వీరి ప్రజ్ఞ విశిష్టమైనది. ఆ ప్రయత్నంలో ఇతరుల సహకారం తీసుకుంటూ క్రొత్త విషయాలను ఆవిష్కరించగలుగుతూ ఉంటారు. నిరంతర కృషీశీలతలోనూ, నిత్యోత్సాహములోనూ వీరు ఆనందిస్తారు. తమ ప్రయత్నంలో ఇతరులకు అవకాశాన్ని కల్పించి సాముదాయక శక్తిని ఏకోన్ముఖం చేసే నేర్పు వీరికుంటుంది. సాహసాన్ని, పోటీని వీరు అభిలషిస్తారు. కుజునికున్న గూఢచారి, సైన్యాధ్యక్షుడు అనే రెండు లక్షణాలలో సైన్యాధ్యక్షుడు అనే లక్షణానికి ప్రతీక మేష రాశి. అందువలనే పొట్టేలులా ఇతరులను ఎదుర్కొనే లక్షణం ఈ రాశివారిలో ఎక్కువ కన్పిస్తుంది. పోటీ ఎంత ఎక్కువగా ఉంటే అంత అధికంగా కృషి చేసి విజయం సాధించడం వీరిలో కన్పిస్తుంది. విఘ్నాలను, ఆటంకాలను అధిగమించడం వీరికి ఆనందదాయకం. లోకంలో అసాధ్యమేమీ లేదని ప్రయత్నంతో, అనుభవంతో అన్నిటిని సాధించగలమనే విశ్వాసం గల వీరి ఆలోచన పరిపూర్ణత కలిగినదై శోభిల్లుతుంది.

లోకంలో జరిగే అన్ని విషయాలను తెల్సుకోవాలనే ఉత్సుకత, ఆ పరిజ్ఞానం తమ కృషిలో వినియోగించుకోవాలనే తపన వీరిలో కన్పిస్తుంది. సౌమ్యంగా మాట్లాడుతూ ఇతరులకు సహకరిస్తూ వారినుండి సహకారం తీసుకుంటూ క్రమబద్ధమైన అభివృద్ధిని సాధిస్తారు. ఇది చరరాశి కావడం వల్ల శీఘ్ర చలనాన్ని వేగంగా కార్య సాధనను వీరు కోరుకుంటారు. అది ఇతరులకు ఇబ్బందిని కూడా కలిగిస్తూ ఉంటుంది. ఎప్పుడూ ఉల్లాసంగా అన్ని కార్యాలలోనూ ఉత్సాహాన్ని చూపుతూ లేని ఉత్సాహాన్ని తెచ్చుకొని ఉత్సాహంగా కన్పిస్తుంటారు. ఆశావాదిగా ముందుకు కొనసాగుతూ అపజయాలను లెక్కచేయకుండా ఉంటారు. అసాధ్యాలు లేవని నిశ్చయంతో ముందుకు కొనసాగుతూ ఈ పని కావడం కష్టం అని భావించేవారిని కూడా తన వాక్చాతుర్యంతో కార్యోన్ముఖులను చేస్తారు. వచ్చిన ఆటంకాలను ఉత్సాహంతో ఎదుర్కొని మరల కార్యోన్ముఖులు అవుతుంటారు.

ఈ రాశివారు తమ అతి విశ్వాసంతో ఇతరులపై ప్రభావం చూపుటకు చేసే ప్రయత్నాలు కొన్ని సందర్భాలలో వ్యతిరేక ఫలితాలు ఇస్తుంటాయి. కార్యం సిద్ధించాలనే పట్టుదలతో పనిలో వున్న ఇబ్బందులను గూర్చి ఆలోచించకుండా అనుకూలాలను గూర్చి మాత్రమే ఆలోచించి వాటినే ఇతరులకు తెలపడానికి ప్రయత్నించడం వలన పనికి సంబంధించిన సమగ్రమైన సమాచారం తమ మాటలలో వ్యక్తపరచలేరు. సున్నిత స్వభావం కలవారు వీరి మాటలలోని చురుకుదనాన్ని కాఠిన్యాన్ని తట్టుకోలేక మానసికంగా కష్టపడుతూంటారు. ఇతరులకు కష్టాన్ని కలిగించామనే విషయాన్ని వీరు అర్థం చేసుకోలేరు. లక్ష్యాన్ని సాధించాలనే తొందరపాటు వల్ల కొన్ని సందర్భాల్లో లక్ష్యం దెబ్బతినేటట్లుగా ప్రవర్తిస్తుంటారు. వీరికి గర్వం ఎక్కువ. వీరి ఔద్ధత్యం ఇతరులను ఇబ్బంది పెడుతుంది. ఇతరుల అభిప్రాయాలకు విలువ ఇవ్వని లక్షణం వలన ఎక్కువ పట్టుదల గలవారుగా గుర్తించబడతారు. వీరు అనుకున్న సమయానికి ఇతరులు పని పూర్తి చేయనట్లైతే సహనాన్ని కోల్పోయి శారీరకంగాను, మానసికంగాను నిస్సత్తువ పొంది కోపాన్ని, అధైర్యాన్ని పొందుతుంటారు. సక్రమమైన మార్గంలో పెంచబడనిచో వీరు మంచి, చెడుల వివేకాన్ని పొందనందువలన తామూహించిన మార్గంలోనే ముందుకు పయనించి నేర ప్రపంచంలో న్యాయకత్వం పొందుతారు. నిదానంగా ఆలోచించడం వల్ల తన భావాన్ని స్పష్టంగా ప్రకటించినందువల్ల భావోద్రేకాలను జయించగలుగుతారు.

ఇతరులను శాసించడంలోను, కోపాన్ని ప్రకటించడంలోను, స్వతంత్రులమనిపించుకోవడంలోను వీరికి ప్రీతి ఎక్కువ. అగ్నితత్వ రాశి అయినందువలన నీరంటే వీరికి ఇష్టం ఉండదు. కాయ శరీరంకలిగి ఉంటారు. కిడ్నీలకు సంబంధించిన అనారోగ్యం వచ్చే అవకాశం ఉంది. ఉత్సాహం, అతిశయం వల్ల వీరి శక్తిలో ఎక్కువ శాతం దురుపయోగం అవుతుంది. వీరిలో సాహసం దృఢమైన మానసిక శక్తి చంచల ప్రవృత్తి సమ్మిళితమై లక్ష్యాలను తరచు మారుస్తూంటారు. సరైన మార్గదర్శకత్వం

లభిస్తే అసాధ్యకార్యాలెన్నింటినో సాధించగలరు. వీరిలో యుద్ధప్రియత్వం అధికంగా కన్పిస్తుంది. స్వాతంత్ర్య ప్రియత్వం వల్ల తమ పనిలో ఇతరుల ప్రవేశాన్ని ఇతరుల ఆక్షేపణను సహించలేరు. ఇతరులు వేలెత్తి చూపితే ఆ మార్గాన్ని వదిలేసి ఇంకో మార్గాన్ని ఎన్నుకునే పరిస్థితుల వలన వీరి జీవితంలో ఎన్నో మార్పులు జరుగుతుంటాయి. తమ మనస్సును తాము నియంత్రించుకో గలిగితే కార్యసాఫల్యాలను పొంది చాలా ఉన్నత స్థితికి చేరుకుంటారు. తమను పొగిడే వారిని దగ్గర చేయడం, విమర్శించే వారిని దూరంగా ఉంచుకోవడం అనే లక్షణం వల్ల వారు సాధించవలసిన విజయాలను సాధించలేకపోతుంటారు. తొందరపాటు తనంవల్ల సరైన ప్రణాళికను ఏర్పరచుకోక ఆరంభించిన కార్యాలను పూర్తి చేయడంలో అసమర్థులవుతుంటారు. ఎదుట వారిచ్చిన సలహాలను మరో కోణంలో దర్శించినందువల్ల సలహాలను అంగీకరించే మానసిక స్థితి వీరికుండదు.

జీవితంలో చాలా గొప్పతనాన్ని సాధించాలనే కాంక్షవల్ల తమ మనోభావాలను బయటకు ప్రకటించరు. నిదానంగా ఆలోచించనందువల్ల వ్యవహార కుశలత లోపించినందువలన తన మాట అందరూ వినాలని పట్టుదల వల్ల మిత్రులను కూడా శత్రువులుగా మార్చుకుంటూంటారు. తమ లక్ష్యాలు సాధించడానికి అక్రమ మార్గాలు ఆశ్రయించడానికి కూడా వీరు వెనుకాడరు. ఈ పరిస్థితుల వల్ల ఇతరులను ఇబ్బందులకు గురి చేసినందు వల్ల కొన్ని పరిస్థితులలో ప్రాణాపాయం పొందే అవకాశం కూడా వుంది. ఇతరులను కఠోరంగా శాసిస్తూ తమ అనుచర వర్గంతో కార్యాలను సాధిస్తూంటారు. సమస్యను సమగ్రంగా ఆలోచించకుండా ఇతరుల వివాదాలలో ప్రవేశిస్తూంటారు. వస్త్ర ధారణ విషయంలో ప్రత్యేక శ్రద్ధ కలిగి వుంటారు. తన చుట్టూ వున్న వారు తనకంటే ఉన్నతులు కాకూడదు అనే కాంక్ష వీరికి బలంగా ఉంటుంది అందువలన ఉన్నతుల సలహాలు తీసుకొనే అవకాశం వీరికి తక్కువ. అభివృద్ధి సాధించడం విషయంలో పట్టుదల అధికంగా వున్నా అందరికి ఆదర్శవాదులుగా కనిపించే ప్రయత్నం

చేస్తూంటారు. వీరు ఇంటి విషయాలు పట్టించుకోరు. సామాజిక కార్యాలలో ఆశక్తి ఎక్కువగా ఉంటుంది. ఎక్కువ మందితో సంబంధాలవల్ల, కార్యసాధనలో పట్టుదలవల్ల, ఇతరులతో పనిచేయించేనేర్పు వల్ల వీరి ఆర్థిక స్థితి ఉన్నతంగానే ఉంటుంది. కాని, ఆలోచనారాహిత్యం వల్ల సాహసం వల్ల తమ శక్తికి మించిన కార్యాలను సాధించాలనే తొందరపాటు వల్ల కొన్ని సందర్భాలలో ఆర్థిక నష్టాలు కూడా అధికంగానే ఉంటాయి. తరచుగా తమ పూర్వానుభావాలను జ్ఞప్తిలో వుంచుకోనందువలన నష్టపోతుంటారు. ఇంటిలో, వ్యాపారంలో, ఉద్యోగ స్థానంలో ప్రముఖంగా గుర్తించబడాలని కోరుకుంటారు. తమ ఆలోచనలన్నీ తమ స్థాయికి మించినవి గానే కొనసాగుతూంటాయి. ఆవేశం ఎక్కువ. ఉద్యోగంలోనైనా, వ్యాపారంలోనైనా అధిక ప్రయోజనాలను ఆశిస్తూ వివాదాత్మకులుగా గుర్తించబడతారు. ఇతరుల కార్యాలను సాధించడం విషయంలో కూడా కృషి చేసి నాయకత్వం వహించాలని కోరుతూంటారు. తరచుగా ఈ రాశిలో రాజకీయ నాయకులు వివాదాలను పరిష్కరించే వారు ఇతరులకు సలహాలిచ్చేవారు, వక్తలు, కంపెనీలు స్థాపించే వారు, సైనికులు, పోలీసు అధికార్లు, రసాయనిక శాస్త్ర వేత్తలు, ఎముకలకు సంబంధించిన వైద్యం చేసేవారు, ఆపరేషన్లు చేసేవారు, లోహ సంబంధమైన వృత్తిని చేసేవారు, యంత్ర సంబంధమైన పరిజ్ఞానం కలవారు ఔన్నత్యాన్ని సాధించ గలుగుతారు.

లక్ష్య సాధనలో అక్రమ మార్గాలు అనుసరించడానికి వెనుకాడని మనస్తత్వం వల్ల నేర ప్రవృత్తి గల వృత్తులలో కూడా ప్రవేశిస్తూంటారు. మార్షల్ ఆర్ట్స్ అనే పదం కూడా మార్స్ అనే గ్రహం నుండి ఉత్పత్తి అయినదే. సైనికునిగా గుర్తించబడిన కుజుడు ఈ రకమైన యుద్ధ విద్యలతో సంబంధం కలిగి ఉండడం సహేతుకమే.

మేషం వారి దృష్టిలో ప్రేమ, మైత్రి ప్రత్యేక స్థానం కలిగిన అంశాలు. తాము తమ ప్రేమను పూర్తిగా ప్రదర్శించి ఎదుట వ్యక్తులను లోబరచుకున్న

తరువాత ఎదుటి వారు జీవితాంతం తమకు లొంగి ఉండాలని అభిప్రాయ పడుతూంటారు. ఆ ప్రేమను సాధించడం కోసం సాహసాలకు కూడా వెనుదీయరు.

**వృషభం :-** వృషభం అంటే ఎద్దు. ఈ రాశివారు స్థిరమైన అభిప్రాయాలు కలిగి ఉంటారు. పొరపాటు లేకుండా తాపీగా పనిచేసి విజయం సాధిస్తారు. ఎంతటి శ్రమకైనా ఓర్చుకుంటారు. విశాలమైన ముఖము, లావైన మెడ, ఉన్నతమైన భుజాలు, పుష్టి గల శరీరం కలిగి నిండుగా కన్పిస్తారు. వీరిలో ఓర్పు అధికంగా వున్నా కోపం తీవ్రంగానే ఉంటుంది. మొదటి సగం జీవితం తరువాత స్థాన చలనం అభివృద్ధి వుంటాయి. ప్రతీ పనిలో భాద్యత వహించే లక్షణం వల్ల శ్రమకు వెనుకాడక పనిచేసినందువల్ల వారితో పని చేయించుకోడానికి ఎక్కువ మంది ఇష్టపడతారు. పై అంశాలన్నీ ఎద్దు లక్షణాలను పోలి ఉండడం గమనించవచ్చును. సూక్ష్మ విషయాలను జాగ్రత్తగా పరిశీలించడం వీరికిష్టం. వీరు సంప్రదాయమన్నా, సాంఘికగౌరవమన్నా ఎక్కువ ఇష్టపడతారు. ఆభరణాల యందు ఆసక్తి కలిగి ఉంటారు. జీవితానుభవమే వీరికి అనేక విధములుగా సహాయపడుతుంది. వృషభ రాశికి చెందిన వ్యక్తులు ఇంటిలో శాంతిని ఎక్కువగా కోరుకుంటూ ఉంటారు.

వీరు ఒక విషయాన్ని దృష్టిలో ఉంచుకున్న, దానిమీద నుండి దృష్టిపోనీయరు. అంతేకాక వేరొక విషయాలను గూర్చి ఆలోచించరు. మధుర పదార్థాల పై అధిక ప్రీతి ఉంటుంది. పరోపకార చింతన అధికం. వీరి దానగుణం జాలితో కూడి ఉంటుంది.

**మిథునం :-** భారతీయ పద్ధతి ప్రకారం మిథునం దంపతులకు ప్రతీక. పాశ్చాత్య పద్ధతిలో కవలలు. ఇది ద్విస్వభావరాశి. తమ అభిప్రాయానికి తామే వ్యతిరేక ఆలోచనలు కూడా చేయగలరు. లోకంలో ఏ ఇరువురి వ్యక్తుల అభిప్రాయం ఒక్కటిగా ఉండదు. అలానే దంపతులుగాని, కవలలుగాని వారివారి అభిప్రాయాలతో భేదాలుంటాయి. ఏ పని చేస్తే ఏ రకమైన ఇబ్బంది కల్గుతుందో అనే సంశయం కలిగి ఉంటారు. వీరి

మాటలలో హాస్య ప్రియత్వం, చమత్కారం కన్పిస్తుంది. వీరిలో సృజనాత్మక శక్తి అధికంగా ఉంటుంది. వీరికి రెండు వృత్తులకు సంబంధించి ఆదాయం ఉంటుంది. వీరు అతి విశ్వాసంతో వ్యాపారంలో ధనం పెట్టుబడి పెట్టి నష్టపోవుటకు అవకాశముంది. గ్రంధరచన, గ్రంథాలను ప్రచురించడం మొదలగు ఆశక్తి చూపుతారు. వీరు ఎక్కువగా తమ కోసం, తమ సంతోషం కోసం మాత్రమే ఎక్కువగా ఆలోచిస్తూ ఉంటారు.

**కర్కాటకం :-** కర్కాటకం అంటే పీత. మార్గంలో ఏ మాత్రం అలికిడి కలిగినా వెంటనే పీతకన్నంలో దూరుతుంది. ఇతరులేమంటారో, ఏమనుకుంటారో అనే భావనతో వారి ప్రవర్తన అతి జాగ్రత్తతో ఉంటుంది. ఓర్పు తక్కువగా ఉండడంవల్ల కష్టసుఖాలను తట్టుకొనే స్థితిలో వీరుండరు. నీటి ప్రయాణాలయందు ప్రీతి. జల ప్రమాదాలకు అవకాశముంటుంది. నీటి నుంచి ఉత్పత్తి చెందే వస్తువులతో వ్యాపారం, వృక్ష ధాన్య జాతులతో వ్యాపారం రాణిస్తాయి. వీరి వైవాహిక జీవితంలో సౌఖ్యం తక్కువగా ఉంటుంది. వీరికి జలప్రమాదాలుండటకు అవకాశం మెండు. వీరి ప్రవర్తన ఇతరులకు అర్థంకాకుండా ఉంటుంది. ఇతరులతో పోటీ ఉంటే వీరు గొప్ప కార్యాలు చేస్తారు. క్రొత్తమార్గాలను అన్వేషిస్తారు. వీరు మానవత్వపు విలువలకు ప్రాధాన్యం ఇస్తారు. వారి లక్ష్య సాధనలో అడ్డంకులు ఏర్పడిన అవి తమకు అనుకూలంగా వచ్చే వరకు ఎదురుచూచి అనుకూల వాతావరణం ఏర్పడగానే లక్ష్య సాధన చేస్తారు. వీరు తమ కుటుంబం కోసం ఎక్కువగా శ్రమ పడుతూ ఉంటారు. కుటుంబసభ్యులతో ప్రేమగా వ్యవహరిస్తూ ఉంటారు. చిన్న చిన్న విషయాలలో తప్పులు జరిగినా విపరీతంగా బాధపడుతుంటారు.

**సింహం :-** ఈ రాశివారు న్యాయబద్ధ ప్రవర్తన కల్గియుందురు. వీరు స్వశక్తిచే క్రమక్రమంగా అభివృద్ధి సాధించెదరు. వీరి యందలి గౌరవంవలన జనులు వీరికి లొంగి ఉండి సహకరిస్తారు. అవినీతి, అన్యాయాలు వీరికి నచ్చని విషయాలు. ఎదుటి వారు తప్పు ఒప్పుకున్న క్షమించే గుణం

కలవారు. ఆశ్రయించిన వారిని రక్షించుటకై ఎన్ని కష్టాలు, నష్టాలనైనా ఓర్పుతో సహించగలరు. శారీరక మానసిక శ్రమలను ఓర్చుకొనుట వల్ల నిరంతర కృషీశీలత కలిగి ఉంటారు. తమ సమస్యలకు యితరులకు తెల్పుట కిష్టపడరు. ఎట్టి పరిస్థితులలోను ఇతరుల సహకారాన్ని ఆపేక్షించరు. కీర్తి కాంక్ష, పదవీప్రీతి వీరికి అధికం. ఇతరుల తప్పులను ప్రత్యక్షంగా విమర్శించడం వల్ల వీరికి ఎదుట పడటానికి ఎవరూ ఇష్టపడరు. శత్రువులపై విజయం సాధిస్తారు. మనో ధైర్యంవల్ల కష్టాలను ఎదుర్కొని వాటి, నివారణోపాయాలు ఊహిస్తారు. వీరు నాయకులుగా ప్రవర్తించడానికి అధికంగా అవకాశాలున్నాయి. వీరు ఒక లక్ష్య సాధన కోసం కృషి చేసి ఆనందంతో పాటు లక్ష్మి సాధన కూడా చేస్తారు. వీరు ఆలోచనా శక్తితో చాల తక్కువ వ్యవధిలో నిర్ణయాలు తీసుకోవడం జరుగుతుంది.

**కన్య :-** ఈ రాశివార్కి సౌమ్య స్వభావం. జ్ఞాపశక్తి అధికం. అంతేకాక యితరులను ఇట్టే ఆకట్టుకుంటారు. లలిత కళలపై అభిమానం కలిగి ఉంటారు. అప్పులు చేయడంలో నేర్పుకలిగి ఉంటారు. ఉన్న వయస్సు కంటే తక్కువ వయస్సు ఉన్నవారిలా కనబడతారు. ఇతరులు తమను గౌరవింపకున్నను, ఇతరులను తప్పక గౌరవిస్తారు. వీరిలో జాలి, కోపం, వినయం, ప్రేమ అధికంగా ఉంటాయి. చొరవ అధికంగా ఉంటాయి. బిడియం కూడా వీరిలో కన్పిస్తుంది.

ఈ రాశిలో జన్మించినవారు మంచి ప్రణాళిక రూపకర్తలు. వీరు అనుకునే లక్ష్యం లేదా గమ్యం అత్యున్నతంగా ఉంటుంది. వీరు నిశిత పరిశీలనా దృష్టి కలిగి ఉంటారు. ఒక్కొక్కసారి తమ అభిప్రాయాలను యితరులపై రుద్దడానికి కూడా వెనుకాడరు.

**తుల :-** తుల అంటే త్రాసు. ఇందులో రెండింటికి ప్రాధాన్యతనిచ్చే లక్షణం ఉంది. ఇరువురి మధ్య న్యాయబద్ధమైన తీర్పులు, పక్షపాత వైఖరి లేకపోవడం, ఇతరులను ఆకట్టుకొనే విధంగా మాట్లాడడం, ఏ విషయం గురించి అయిన తులనాత్మకంగా మాట్లాడడం అనేవి ఈ రాశి ప్రత్యేక

లక్షణాలు. చేయవలసిన పనులలో సమయనియమ పాలన చేస్తారు. ఏ పనికైనా క్రమ పద్ధతిలో ఆచరించటమే కాక అవకాశాలను తమ కనుగుణంగా మలచుకొని కాలాన్ని ధనాన్ని సద్వినియోగ పర్చుకుంటారు. లెక్కలు కట్టడంలో వీరికి ప్రజ్ఞ ఉంటుంది. శుచి శుభ్రతలపై మక్కువ ఎక్కువ. నిర్మలత్వం స్వచ్ఛత అంటే మహాయిష్టం. వీరిలో చురుకుదనం, భావావేశం ఉంటాయి. దైవిక కార్యాలపై ఆసక్తి ఉంటుంది. ఈ రాశిలో జన్మించిన వారికి మంచి స్నేహితులుంటారు. ఏదేని ఒక నిర్ణయం తీసుకొనేముందు లాభ నష్టాల బేరీజు వేసుకోవడం జరుగుతుంది. ఈ రాశిలో జన్మించిన వారిలో కొందరు అవకాశవాదులుగా మారుతుంటారు.

**వృశ్చికం :–** వృశ్చికం అంటే తేలు. వీరికి నిగూఢ ప్రవర్తనయందు ప్రీతి. ఏ విషయంలోనైనా తాము బయటపడకుండా యితరుల ప్రవర్తన కనిపెట్టుటలో ప్రీతి ఎక్కువ. ఆత్మరక్షణ విషయంలో వీరు ప్రజ్ఞ కలిగి ఉంటారు. ఎటువంటి వాతావరణంలోనైనా చక్కగా ఇమిడిపోగలరు. వీరు ఎక్కువ తీవ్ర స్వభావం కలిగి ఉండడం వల్ల మిత్రులు కూడా శత్రువులుగా మారే అవకాశముంది. ఎదుటి వారి దోషాలు గుర్తించే నేర్పు కలిగి ఉంటారు. ఎదుటివారు ఇబ్బంది పెట్టనంతవరకు ఎవరి జోలికి వెళ్లరు. ఎవరైనా ఇబ్బంది పెడితే మానసిక శక్తిని పూర్తిగా కేంద్రీకరించగల శక్తి వీరికుంటుంది. వీరు ఒక లక్ష్యం ఏర్పరుచుకుంటే అది సాధించడానికి ఎంత ప్రయత్నమైనా చేసి సాధిస్తారు. ఇతరులు తమ పనిని గుర్తించాలని ఆకాంక్షిస్తారు.

**ధనుస్సు :–** ధనుస్సు అంటే విల్లు. పరిస్థితులు అనుకూలంగా లేకపోయినప్పుడు, అనుకూల వాతావరణం ఏర్పడేవరకూ ఎంతకాలమైనా ఓర్పువహించెదరు. ఆపదల్ని అధిగమించే నేర్పు లక్ష్యాన్ని సాధించగలిగే ప్రజ్ఞ వీరి ముఖ్య లక్షణాలు. కార్య సాధనకై ఎంతటి కష్టాలకైనా ఓర్చుకోగలరు. వీరికి నచ్చని విషయాలలో కృషి చేయరు. వీరిలో పట్టుదల, ఏకాగ్రత అధికంగా ఉంటుంది. వీరి సూటి ప్రవర్తన వల్ల కొందరితో వైరుద్యం

ఏర్పడుతుంది. ఈ రాశిలో పుట్టిన వారు మనసులో ఎన్ని బాధలున్నా ఓర్పుతో నిగూఢంగా ఉంటారు. తమ కష్టాలు ఇతరులకు తెలియ పరుచుటకు యిష్ట పడరు. వీరికి కూర్చుని చేసే పనులకంటే తిరిగి చేసే పనులయందు ఇష్టం అధికం. వీరిలో వాదనాపటిమ అధికం. మనసులోని మాటలను ధైర్యంగా వ్యక్తీకరించడం వల్ల వీరి ప్రవర్తనన న్యాయబద్ధం అవ్వడం వల్ల అందరూ వీరిని నమ్ముతారు. తనను నమ్మిన వారికి శక్తివంచన లేకుండా ఉపకరిస్తూ ఉంటారు. వీరికి ఆటలన్న ఎక్కువ ఇష్టం. వీనిలో జయం అపజయం ముఖ్యం కాదు. వీరు క్రమశిక్షణాలోపంతో శక్తిని వృధాపరచుకుంటారు.

**మకరం :-** వీరికి పట్టుదల ఎక్కువ. తాము జరుపు వ్యవహారముల యందు, వృత్తియందు చాతుర్యం కల్గి ప్రవర్తిస్తారు. వీరు లక్ష్య సాధనకై ప్రయత్నించే సందర్భంలో అక్రమ మార్గమా, సక్రమ మార్గమా అని ఆలోచింపరు. ఎదుటి వారికి అనుకూలంగా ప్రవర్తించి వారిని తమ మార్గంలోకి తెచ్చుకొనడం జరుగుతుంది. ఇతరులకు అమాయకంగా కనపడుతుంది లోక వ్యవహారాలలో సామర్థ్యం అధికంగా ఉంటుంది. వీరికి మర్యాదలన్నా ఆచారాలన్నా ఇష్టం. వీరి సంకల్ప శక్తి పటిష్టమైనది. ఇతరుల రహస్యాలు, సూక్ష్మ విషయాలు కూడా కనిపెట్టగల నేర్పుకలవారు. కీడెంచి మేలెంచు స్వభావులు, స్థానబలంతో ఎంతటి కార్యాలనయిన సాధించగలరు. ఈ రాశిలో జన్మించినవారు ఆలోచనతో ముందు అడుగువేయుదురు. ఈ రాశివారు కష్టపడి పనిచేయు స్వభావం గలవారు. ఐతే ఒకసారి లక్ష్యసాధనకు కష్టపడడం మొదలుపెడితే వెను తిరుగు స్వభావం లేనివారు. ఈ రాశిలో జన్మించిన వారికి వ్యాపార సంబంధ విషయాలు - డబ్బు విలువ తెలుసు.

**కుంభం :-** వీరికి తెలివితేటలధికం. ఏకాంత జీవనం అంటే ఇష్టంవలన ఎక్కువగా ఇతరులతో కలవరు. వీరిలో ఆలోచన ఎక్కువ పని తక్కువ. అందుకే యితరులు వీరిని సోమరిపోతులుగా గుర్తిస్తారు. గర్వం అధికంగా ఉన్నను ఎదుటివ్యక్తి కష్టనష్టాలను తెల్సుకొని ప్రవర్తిస్తారు. పటిష్ఠమైన

శరీరం, గుండ్రని ముఖముతో చక్కని ముఖవర్ఛస్సు కల్గి ఉంటారు. సూక్ష్మ విషయాలలో ఆసక్తి, శాస్త్రీయమైన సత్యాన్వేషణలో నేర్పు అధికం. వీరికి వేదాంత విషయములు, మత సంబంధ విషయములు ఆశక్తి అధికం. మితిమీరిన శ్రమ వీరి శరీరానికి సరిపడదు. శాస్త్ర పురోగతికి, సంఘ సంస్కరణ యందు, లలిత కళల పురోభివృద్ధికి పాటుపడెదరు. స్వచ్ఛమైన ప్రేమ, మైత్రి అనువానికి ప్రాముఖ్యమిస్తారు. వీరు మృదు స్వభావం, దయ, వినయం, మధుర వాక్కు కలిగి ఉంటారు. ఎన్ని అడ్డంకులు ఎదురైనను ఆదర్శాలను వదలక వాటికై కృషి చేస్తారు. వీరు వ్యక్తపరచే పనులుకొన్ని జరుగనివిగా ఉంటాయి.

**మీనం :–** ఈ రాశి సంకేతం ఒక చేప యొక్క తోక వేరొక చేప యొక్క ముఖం వైపుకు ఉండు విధంగా ఉంటుంది. పరిస్థితుల కనుగుణంగా వీరి స్వభావం మారుతూ ఉంటుంది. ఊహాప్రపంచంలో జీవిస్తూ ఉంటారు. వీరికి నీరు అంటే యిష్టం. జల సమీప ప్రదేశాలలో వీరు అభివృద్ధిలోకి రాగలరు. సుకుమార భవన, సున్నిత ప్రవర్తన కలిగి ఉండి, ఇతరులను కష్టపెట్టకుండా వారిని సంస్కరించే నేర్పుకలవారు. ఈ రాశి యందు జన్మించినవారు ఎక్కువ రచనా చతురత, వాక్పటుత్వము కల్గి ఉంటారు. ప్రయాణాలయందు ఆసక్తి ఎక్కువ, వీరిలో ఆలోచనా శక్తి వల్ల మంచి మంచి నిర్ణయాలు తీసుకొనడం జరుగుతుంది. వీరు కాలాన్ని వృధా చేయక ఏదో ఒక పని చేస్తూంటారు. వీరి త్యాగం వల్ల ఒక వ్యక్తి అభివృద్ధిలోకి వస్తారు. వృత్తి యందు గౌరవ భావము, శ్రద్ధ కలిగి ఉంటారు. ఈ రాశిలో జన్మించిన వారికి తల్లికంటే దండ్రియందే అధిక ప్రీతి. ఇతరుల కష్టాలు సులువుగా అర్థం చేసుకోగల స్వభావం కలవారు. వీరికి శాంతి అంటే చాలా ఇష్టం. ఈ రాశిలో జన్మించిన కొందరు మత్తు పదార్థాలకు, అలవాటు పడే అవకాశముంది. వీరిలో మానసిక శక్తి తక్కువగా ఉంటుంది.

# రాశులు - గ్రహాలు

భారతీయ జ్యోతిషంలో ఒక రాశిని హోరా, ద్రేక్కాణం, సప్తాంశ, ద్వాదశాంశ, నవాంశ, త్రింశాంశ, షష్ట్యంశ మొదలయిన రీతులలో విభజనలు చేసి గ్రహం యొక్క బలాన్ని తెలుసుకుంటారు. అలాగే ఆయా చక్రాల ద్వారా జీవితంలోని వేరు వేరు అంశాలు తెలుసుకొనే ప్రయత్నం చేస్తారు. ఉదాహరణకు సప్తమాంశ వివాహానికి, దశమాంశ వృత్తికి, హోరా ఆర్థిక విషయాలు తెలుపుతూ ఉంటుంది. పాశ్చాత్య జ్యోతిషంలో లగ్నం, హోరా, ద్రేక్కాణం మొదలయిన వాటిని పరిశీలిస్తారు. వాటిలో ప్రతి దానికి ప్రత్యేక ఫలాలు చెప్పబడుతూ ఉంటాయి. ఒక రాశిలో 30 డిగ్రీలు ఉంటాయి. వాటిలో ప్రతి డిగ్రీకి ఫలితాలను చెప్పే పద్ధతి ఉంది. అది భారతీయ జ్యోతిషంలోని త్రింశాంశ కంటే వేరయినది.

**హోరా :-** రాశిలోని సగ భాగాన్ని హోర అంటారు. విషమ రాశులలో (మేష, మిథున, సింహ, తుల, ధనుస్సు, కుంభములు) మొదటిది సూర్యహోర, రెండవది చంద్రహోర, సూర్యహోరను positiveగాను, చంద్రహోరను negativeగాను భావన చేస్తారు. సమరాశులలో (వృషభ, కర్కాటక, కన్య, వృశ్చిక, మకర, మీనములు) మొదటి సగభాగం చంద్రహోర రెండవ సగ భాగం సూర్య హోర.

**ద్రేక్కాణం :-** రాశిని మూడు సమాన భాగాలుగా భావించడం. ఒక్కొక్క భాగాన్ని ద్రేక్కాణం (Decante) అని పిలవటం జరుగుతుంది. మొదటి ద్రేక్కాణానికి ఆ రాశి నాథుడే అధిపతి. రెండవ ద్రేక్కాణానికి ఆ రాశి నుండి పంచమాధిపతి అధిపతి. మూడవ ద్రేక్కాణానికి నవమరాశ్యధిపతి అధిపతి. ఉదాహరణకి మేష రాశిలో మొదటి ద్రేక్కాణానికి కుజుడు, రెండవ ద్రేక్కాణానికి రవి, మూడవ ద్రేక్కాణానికి గురుడు అధిపతులు అవుతారు.

**సమ, విషమ రాశుల ప్రభావములు :-** సఫేరియల్ మతాన్ని అనుసరించి విషమ రాశులు, విషమ భావాలు పురుషుల జన్మకుండలులతో

ఎడమ వైపు ఆయా శరీర భాగాలను సూచిస్తాయి. సమ రాశులు సమ భావాలు కుడి వైపు అంగాలను సూచిస్తాయి. స్త్రీ జాతకములలో విషమరాశులు, విషమభావాలు కుడివైపు అంగాలను, సమ రాశులు, సమ భావాలు ఎడమ వైపు అంగాలను సూచిస్తాయి.

## చర, స్థిర, ద్విస్వభావములు :-

| | | |
|---|---|---|
| మేష, కర్కాటక, తుల, మకరములు | -- | చరరాశులు |
| వృషభ, సింహ, వృశ్చిక, కుంభములు | -- | స్థిర రాశులు |
| మిథునం, కన్య, ధనస్సు, మీనం | -- | ద్విస్వభావ రాశులు |

ఈ పేర్లు భారతీయ జ్యోతిషంలోనూ, పాశ్చాత్య జ్యోతిషంలోనూ సమానమే. భారతీయ జ్యోతిషంలో ఆయా పేర్లను బట్టే ఫలితాలను ఊహించుకోమనే భావన శాస్త్రజ్ఞులలో ఉండి ఉండవచ్చును. అందువలన వాటికి వ్యక్తి స్వభావములతో సమన్వయం చేసి ఫలితములు చెప్పే పద్ధతి ప్రత్యేకించి లేదు. పాశ్చాత్య జ్యోతిషంలో వాటిని ప్రత్యేకంగా పేర్కొని ఫలితాలు చెప్పడం ఉంది. చర రాశిలో జన్మించిన వారు చంచల స్వభావం కలిగి ఉంటారు. నిర్ణయాలు స్థిరంగా ఉండవు. స్థిర రాశి వారు స్థిరమైన అభిప్రాయాలు కలిగి ఎదుటి వారి అభిప్రాయాలను భావాలను తమకు అనుగుణంగా మలచుకుంటారు. ద్విస్వభావ రాశి కలవారు త్వరితంగా నిర్ణయానికి రాలేక తమ అభిప్రాయాలకు వ్యతిరేకంగా తాము ఆలోచించే మనస్తత్వం కలిగి ఉంటారు. ఈ రకమైన ఫలిత విశ్లేషణ ప్రాచీన భారతీయ జ్యోతిష గ్రంథాలలో కనిపించదు.

## రాశులు, తత్వాలు :-

| | | |
|---|---|---|
| మేష, సింహ, ధనుస్సులు | -- | అగ్నితత్వ రాశులు |
| వృషభం, కన్య, మకరములు | -- | పృధ్వీ తత్వ రాశులు |
| మిథునం, తుల, కుంభము | -- | వాయుతత్వ రాశులు |
| కర్కాటక, వృశ్చిక, మీనములు | -- | జలతత్వ రాశులు |

ద్విస్వభావ రాశులు, వాయుతత్వ రాశులు, బుద్ధి కుశలతను సూచిస్తాయి. మిథున రాశివారు వాయుతత్వం కలిగిన ద్విస్వభావరాశివారు అవటం వలన బుద్ధి కుశలతకు ప్రతినిధులు అవుతారు. బుధుడు కూడా శుభదృష్టుడై బలవంతుడయితే మేధావులవుతారు. బుధుడు బలహీనుడయితే బుద్ధి చాంచల్యంతో పిచ్చివారవుతారు.

అగ్నితత్వ రాశులు నూతన ఆవిష్కరణలకు ఆధ్యాత్మిక విజ్ఞానానికి ప్రతీకలు. పృధ్వీతత్వ రాశులు విజ్ఞానానికి, వ్యాపారానికి, ఇంద్రియ శక్తులకు ప్రాధాన్యం వహిస్తాయి. వాయు తత్వ రాశులు బుద్ధి కుశలత, కళలు, సంస్కృతి మొదలయిన అంశాలకు ప్రాధాన్యం వహిస్తాయి. జలతత్వ రాశులవారు ఊహలకు, కోరికలకు ప్రాధాన్యం ఇస్తారు.

## భావ విజ్ఞానం

**ప్రథమ భావం :-** వ్యక్తిత్వం, శరీరం, మెదడు, ధనం, ఆయువు, యశస్సు, శిరస్సు. మొదలయిన ఫలితాలు పరిశీలించడానికి ఉపయోగిస్తుంది.

**ద్వితీయ భావం :-** పోగు చేసిన డబ్బు, చేతుల్లో ఆడే డబ్బు, తినే పదార్థాలు, ముఖం, కంఠం, కన్నులు, వాక్కు మొదలగు అంశాలను సూచిస్తుంది.

**తృతీయ భావం :-** తమ్ముళ్ళు, చెల్లెళ్ళు, చిన్న చిన్న ప్రయాణాలు బాహువులు, రచన, వ్రాత పని, పరాక్రమం, శ్వాస నాళాలు, దుఃఖము, విచారము మొదలగు అంశాలకు ప్రతీక.

**చతుర్థ భావం :-** తల్లి లేక తండ్రి (తల్లిదండ్రులలో ఆదరం చూపే వ్యక్తి చతుర్థంలోనూ, అధికారం చూపే వ్యక్తి దశమంలోను చూడాలి). ఊపిరితిత్తులు, బంధువులు, ఇల్లు, సుఖాన్నిచ్చే వస్తువులు, అక్క,

భూమి, జమిందారీ, మనస్సులోని భావనలు మొదలయిన అంశాలు ఈ భావంలో పరిశీలించాలి.

**పంచమ భావం :-** సంతానం, బుద్ధిశక్తి, ఆలోచనా శక్తి, ప్రేమ, వినోదం, హృదయం, పొట్ట మొదలయిన అంశాలు పరిశీలించాలి.

**షష్ఠ భావం :-** శత్రువులు, బాధలు, శ్రమ, సేవ, రోగాలు, గాయాలు, దొంగతనం, వ్యసనం ఆకలి మొదలయిన అంశాలు పరిశీలించాలి.

**సప్తమ భావం :-** వివాహము, స్త్రీ, వీర్యం, కామ చేష్టలు, భాగస్వాములు, నిత్యావసర వస్తువులు, మూత్రేంద్రియం, శత్రువులు మొదలయిన అంశాలు పరిశీలించాలి.

**అష్టమ భావం :-** ఆయువు, మృత్యువు, వారసులు, అవమానం, స్త్రీ ధనం, అండకోశం మొదలగు విషయాలు పరిశీలించాలి.

**నవమ భావం :-** ఉన్నత విద్య, విదేశ యాత్ర, దూరప్రయాణాలు, ధర్మం, తత్వశాస్త్రం, ఉన్నతాధికారం, కటి ప్రదేశం మొదలగు విషయాలు పరిశీలించాలి.

**దశమ భావం :-** వ్యవసాయం, వ్యాపారం, తల్లిదండ్రులు, ఉద్యోగం, యశస్సు, రాజ్యం, మోకాళ్ళు మొదలయిన అంశాలు పరిశీలించాలి.

**ఏకాదశ భావం :-** అన్నలు, అక్కలు, మిత్రులు, ఆదాయం, కోరికలు, పిక్కలు మొదలగు అంశాలు పరిశీలించాలి.

**ద్వాదశ భావం :-** పాదాలు, ఖర్చులు, జైలు, భోగం, త్యాగం, స్వర్గం మొదలగునవి పరిశీలించాలి.

**భావ విభజన :-** క్షితిజ వృత్తం (Horizon Circle), ఖ మధ్య వృత్తం (Meredian Circle), క్రాంతి వృత్తం (Ecliptic Circle) అనే మూడు వృత్తాలు స్థితిని బట్టి భావాల నిర్మాణం జరుగుతుంది. క్షితిజ వృత్తం (Horizon Circle), క్రాంతి వృత్తంలో ఏ భాగం వద్ద ఖండిస్తుందో దానిని లగ్నం అంటారు. మధ్య వృత్తము (Meredian Circle), క్రాంతి వృత్తములో ఏ భాగాన్ని ఖండిస్తుందో దాన్ని దశమ భావం అంటారు. ఈ ప్రకారంగా ఏర్పడిన లగ్న, దశమాలు ఆధారంగా మిగిలిన భావాలను నిర్ణయిస్తారు. భారతీయ పద్ధతిలో ''శ్రీపతి'' చెప్పిన పద్ధతిని పాశ్చాత్యులు Prophyry System అని పిలుస్తారు.

**సమ విభజన పద్ధతి :-** దీనిని టాలెమీ (Ptolemy) అంగీకరించారు. ఈ పద్ధతిలో లగ్నస్ఫుటం నుంచి 30 డిగ్రీలు కలుపగా ప్రథమ భావం ఏర్పడుతుంది. అలా వరుసగా 30 డిగ్రీలు చొప్పున ఒక్కొక్క భావం ఏర్పడుతూ ఉంటుంది. కొందరు పాశ్చాత్య జ్యోతిష శాస్త్రజ్ఞులు గణిత దృష్ట్యా ఇది సరియైనది కాదని భావిస్తున్నారు. మరి కొందరు ఫలదాన విషయంలో ఈ పద్ధతే సరి అయిన ఫలితాలను ఇస్తుందని అభిప్రాయపడుతున్నారు.

**విషమ విభజన (Prophyry System) :-** ఈ పద్ధతిలో దశమ స్ఫుటంనుండి లగ్నస్ఫుటం వరకు ఉన్న దూరాన్ని 3 భాగాలుగా విభజిస్తారు. దానివల్ల ఏకాదశం, ద్వాదశం ఏర్పడుతాయి. దశమ భావానికి ఆరు రాశులు కలిపితే చతుర్థభావం, లగ్నానికి ఆరు రాశులు కలిపితే సప్తమ భావం ఏర్పడతాయి. లగ్న, చతుర్థాలకు ఉన్న దూరాన్ని మూడు సమ భాగాలు చేస్తే ద్వితీయ, తృతీయ భావాలు సిద్ధిస్తాయి. దశమం నుండి చతుర్థం వరకు ఏర్పడిన భావాలకు ఆరేసి రాశులు కలుపుతూ పోతే తక్కిన భావాలు ఏర్పడతాయి.

ఈ పైవి ప్రసిద్ధమైనవి. ఇవికాక Alcabictius System, Regiomontarus System, Morinus System మొదలగునవి ఉన్నాయి.

భారతీయ పద్ధతికి, పాశ్చాత్య పద్ధతికి ఒక ముఖ్యమైన బేధం ఉంది. లగ్నస్ఫుటాన్ని, లగ్నారంభంగా భావించడం పాశ్చాత్య పద్ధతి. లగ్నస్ఫుటాన్ని, లగ్నమధ్యంగా భావించడం భారతీయ పద్ధతి.

**భావము :-** ఖగోళంలో క్రాంతి వృత్తములోని ఏ భాగం జన్మించిన సమయానికి ఉదయిస్తూ ఉంటుందో దానిని లగ్నం అంటారు. అది ఆకాశమంతా నిండిన గ్రహాల ప్రభావానికి ప్రభావితమవుతూ ఉంటుంది. ఈ గ్రహాల ప్రభావం ప్రతీ ప్రాణిపైనా ఉంటుంది. ఆ ప్రభావం వల్లే వ్యక్తి జీవన వికాసం కొనసాగుతుంది. దీనిలో లౌకిక కృషి వల్ల మార్పు తీసుకు వచ్చినప్పటికీ మౌలిక స్వభావంలో మార్పురాదు. పాశ్చాత్య జ్యోతిషంలో లగ్న భావం వర్తమాన కాలానికి, పంచమ భావం భూత కాలానికి, నవమ భావం భవిష్యత్ కాలానికి సంకేతం. భారతీయ జ్యోతిషంలో లగ్నం వర్తమాన కాలానికి, పంచమం భవిష్యత్ కాలానికి నవమం భూతకాలానికి సంకేతం.

**కేంద్రాలు :-** జాతకంలో కేంద్రాలు ముఖ్యమైనవి. తూర్పు ప్రథమ భావం, సప్తమం పశ్చిమం, చతుర్థం దక్షిణం, దశమం ఉత్తరం.

- లగ్న కేంద్రము అభివృద్ధికి, ఉన్నతకి సంకేతం
- దశమ కేంద్రం గొప్పతనానికి, పదవికి, గౌరవానికి యశస్సుకు, సత్కారాలకు సంకేతం.
- సప్తమ భావం సామాజిక సంబంధాలకు సంకేతం
- చతుర్థ భావం క్రియకు సంబంధించిన జ్ఞానానికి సంకేతం. దానిలో క్రియ లేదు, క్రియాత్మక గ్రహాలయిన కుజ, రవులకు చతుర్థం అనుకూలమయినది కాదు.

# ద్వాదశ భావములు

**ప్రథమ భావం :–** కుజుడు ప్రథమభావంలో జలరాశిలో ఉంటే స్త్రీ లోలుడు, మద్యపానాసక్తి కలవాడు అవుతాడు. బాలారిష్టాల విషయంలో పాశ్చాత్య మతంలో చంద్రునకు ప్రాధాన్యమిస్తారు. చంద్రునకు పాపగ్రహ సంబంధముంటే బాలారిష్టం. ఆ దోషాన్ని నివారించే శుభగ్రహ దృష్టి ఉంటే బాలారిష్ట దోష భంగం సంభవిస్తాయి. పాశ్చాత్య జ్యోతిషంలో రవి, చంద్రుడు, ఉన్న స్థానాలకు కూడా లగ్నానికిచ్చిన ప్రాధాన్యమిస్తారు. వారిరువురిలో ఏ ఒక్కడు బలంగా ఉన్నా దీర్ఘాయువునిస్తారు.

**ద్వితీయ భావం :–** ద్వితీయంలోని శని చతుష్పద రాశులయిన మేష, వృషభ, సింహ, మకరాలలో ఉన్నా, నిశ్శబ్ద రాశులయిన కర్కాటక, వృశ్చిక మీనాలలో ఉన్న సంభాషణా శక్తిలో యిబ్బంది ఉంటుంది. పురుష జాతకంలో చంద్రుడు స్త్రీ జాతకాలలో సూర్యుడు ఆర్థిక స్థితిని సూచిస్తారు. అదృష్టానికి సంబంధించి దశమ భావంలో ఉన్న గ్రహాలను పరిశీలిస్తారు. ద్వితీయ భావం, ద్వియాధిపతి ఆర్థిక పరిస్థితిని సూచిస్తాయి.

**తృతీయ భావం :–** ప్రయాణాలు తృతీయ నవమాలను బట్టి పరిశీలించాలి. తృతీయంలో స్వదేశంలోని ప్రయాణాలు నవమంలో విదేశ ప్రయాణాలు. ఈ భావాలు చరాలయినా, భావాధిపతులు చరరాశులలో ఉన్నా ఎక్కువ ప్రయాణాలు సిద్ధిస్తాయి. శీఘ్ర చలనం కల చంద్ర, కుజ, బుధులు ప్రయాణాలకు కారకులు. ఈ గ్రహాలు నవమాధిపతి, కర్కాటకాది జలరాశులలో ఉన్న నవమస్ఫుటం, జలరాశులలో ఉన్నా సముద్రయానం సిద్ధిస్తుంది. నవమంలో గురు శుక్రులున్నా సూర్య, చంద్రులుండి శుభ గ్రహ దృష్టియున్నా విదేశీ యాత్ర సిద్ధిస్తుంది. తృతీయ నమమాలలో పాపగ్రహాలున్నా ఆభావాధిపతులు పాపగ్రహ సంపర్కం కల్గియున్నా సూర్య, చంద్రులు ఆ భావాలలో ఉండి, పాపగ్రహ సంపర్కం కలిగినా విదేశీ యాత్ర జీవన హాని కలిగించే అవకాశం ఉంది.

**చతుర్థ భావం :–** మానసిక స్వభావం, గుణ దోషాలు దీని వల్ల తెలుసుకోవచ్చు. ఆ భావానికి చెందిన రాశి, చంద్రుడు, బుధుడు ఉన్న రాశులు ఈ విషయంలో పరిశీలించదగినవి. మొత్తం గ్రహాలలో అధిక భాగాలు నడిచిన గ్రహం ఆధారంగా స్వభావాన్ని నిర్ణయించే పద్ధతి కూడా పాశ్చాత్య జ్యోతిషంలో కనిపిస్తుంది. జైమిని మతంలో ఇలా అధిక భాగలు నడిచిన గ్రహాన్ని ఆత్మకారకుడంటారు. ఆగ్రహం ద్విస్వభావరాశిలో ఉంటే అందరియందూ సానుభూతి కలవాడై ఉంటాడు. కాని శీలం విషయములో దుర్బలుడవుతాడు. చతుర్థం కేంద్రమయినా అందున్న సూర్యుడు శుభఫలాన్ని ఇవ్వలేడు. బంధువుల వల్ల ఇబ్బందిని, అనారోగ్యాన్ని, కోరికలు తీరక పోవటం వంటి చెడ్డ ఫలితాలను ఇంటికి దూరంగా ఉండే స్థితిని కలిగిస్తాడు.

**పంచమ భావం :–** ఇది సంతానానికి చెందినది. పాశ్చాత్య జ్యోతిషంలో సంతాన సంఖ్యను చంద్రుని బలాన్ని బట్టి నిర్ణయిస్తారు. చంద్రుడు జలరాశులయిన కర్కాటక, వృశ్చిక, మీనాలలో ఉంటే అధిక సంతతి ఉంటుంది. చంద్రుడు దశమంలో ఉంటే, పాపగ్రహ సంపర్కం కలిగి ఉంటే సంతాన నష్టం సూచిస్తాడు.

**షష్ఠ భావం :–** షష్ఠాధిపతి అయిన బుధుడు శని ద్వారా పీడితుడయినచో నత్తి వస్తుంది. కుజుడు షష్ఠంలో ఉంటే చాలా తొందరగా మాట్లాడుతారు. శత్రుత్వానికి సంబంధించిన ఫలితాలు పాశ్చాత్య జ్యోతిషంలో 4,7,8,12 భావాల ద్వారా పరిశీలించాలి. 1,2,4,6,10 భావాలలో శుభ గ్రహం ఎవరితోనూ శత్రుత్వం లేకుండా చేస్తుంది. పాపగ్రహం శత్రుత్వాన్ని కలిగిస్తుంది. రవి, చంద్రులపై పాప ప్రభావముంటే శత్రుత్వాలు ఎక్కువగా ఉంటాయి. సూర్య చంద్రులపై నైసర్గిక పాపగ్రహాల ప్రభావం శుభ దృష్టి (కోణ దృష్టి) కలిగినచో శత్రుత్వం వల్ల లాభం సిద్ధిస్తుంది. సూర్య చంద్రులు మకర రాశిలో ఉండి కుజాది పాపగ్రహాల ప్రభావం ఉంటే మోకాలు సమీపంలో అనారోగ్యాలు, దెబ్బలు తగిలే అవకాశాలున్నాయి.

చంద్రుడు వక్ష స్థలానికి కుజుడు శిరస్సునకు కారకులు. కుజుడు పాపగ్రహ ప్రభావానికి లోనయితే శిరస్సుపై దెబ్బలుంటాయి. బుధుడు మిథునలగ్నాధిపతి అయి పాపగ్రహంచే పీడించబడితే శ్వాస నాళంలోకాని బాహువులలో కాని కష్టాన్ని కల్గిస్తాడు. కన్యా లగ్నాధిపతియైన బుధుడు పాపగ్రహ పీడితుడయితే ఊపిరి తిత్తులకు ఇబ్బంది కలుగుతుంది. వృషభ లగ్నం వారికి శుక్రుడు పాపగ్రహ పీడితుడయితే కంఠంలో అనారోగ్యవకాశాలుంటాయి. తులా లగ్నం వారికి శుక్రుడు పాపగ్రహ పీడితుడయితే మూత్రేంద్రియానికి అనారోగ్యం. మకర లగ్నం వానికి శని పాపగ్రహ పీడితుడయితే మోకాలికి నెప్పులుంటాయి. కుంభ లగ్నం వారికి శని పాపగ్రహ ప్రభావితుడయితే పిక్కలు నెప్పులుంటాయి. ధనుర్లగ్నం వారికి గురుడు పాపగ్రహ పీడితుడయితే కటి ప్రవేశమునకు ఇబ్బంది కలిగిస్తాడు. మీనలగ్నం వారికి గురుడు పాపగ్రహ పీడితుడయితే పాదాలకు అనారోగ్యం. సూర్య చంద్రులలో ఒకడు లగ్నంలో ఉండి పాపగ్రహ పీడితుడయితే ప్రమాదాలకు అవకాశాలెక్కువ. సూర్యుడు, చంద్రుడు పాపగ్రహ సంబంధం కలిగి లగ్నం నుండి దశమ భావానికి మధ్యలో ఉంటే ప్రమాదాలకు అవకాశాలున్నాయి. కుజుడు సామాన్యంగా నిప్పు, తుపాకి మొదలగు వాటి ద్వారా ఇబ్బంది కలిగిస్తాడు. శని పై నుంచి పడటం మొదలయిన ఇబ్బందులు కలిగిస్తాడు. కుజుడు శని లగ్నంలో ఉండగా గోచార రవి వారిని కలిసిన సమయంలో దుర్ఘటనలకు అవకాశం ఉంది. మొదటి ద్రేక్కాణం రాశికి చెందిన అవయవంలోని మొదటి భాగాన్ని, రెండవ ద్రేక్కాణం మధ్యభాగాన్ని, మూడవ ద్రేక్కాణం ఆ అవయవానికి క్రింది భాగాన్ని సూచిస్తుంది. పాపగ్రహం రాశి ప్రథమ ద్రేక్కాణంలో ఉంటే తొందరగా తగ్గే అనారోగ్యాలనూ, రెండవ ద్రేక్కాణంలో ఉంటే కొంచెం ఆలస్యంగా తగ్గే అనారోగ్యాలను, మూడవ ద్రేక్కాణంలో ఉంటే దీర్ఘకాలిక రోగాలను ఇస్తారు. సూర్యుడు, దశమంలో ఉండగా శని కేంద్ర దృష్టులు కలవాడై మిథున, కన్య, ధనుర్మీనాలలో ఉంటే క్షయ రోగానికి అవకాశం ఉంది. ఈ రకమైన శని, కఫ, వాత, పిత్తాలను ప్రేరేపిస్తాడు. గురుడు ఇచ్చే

అనారోగ్యము స్వభావాన్ని అతిగా పెంచేవిగా ఉంటాయి. ఉదాహరణకు అన్నం ఎక్కువ తినడం లాంటివి.

**సప్తమ భావం :-** స్త్రీ జాతకంలో సూర్యుని ఆధారంగా భర్త గుణ దోషాలను పరిశీలించాలి. పురుషుని జీతకాలలో చంద్రుని ఆధారంగా భార్య గుణ దోషాలను పరిశీలించాలి. పాశ్చాత్య జ్యోతిషంలో కూడా అష్టమ కుజుడు భర్త జీవనం పై దోషాలు చూపిస్తాడు. స్త్రీ జాతకాలలో కుజుడు శని యొక్క అశుభ దృష్టి కలిగి ఉంటే స్త్రీకి వివాహం కావటం కష్టం. ఈ స్థితిలో సప్తమ భావాన్ని కూడా పరిశీలించాలి. పురుషుని లాభ భావరాశి స్త్రీ యొక్క లగ్నమయినచో ఆ స్త్రీ పురుషులకు పరస్పర ప్రేమ సిద్ధిస్తుంది. ఒక జాతకంలోని సూర్యస్ఫుటం మరో జాతకంలోని చంద్రస్ఫుటం ఏకీభవిస్తే వారిరువురికీ ప్రేమ సిద్ధిస్తుంది. పాశ్చాత్య జ్యోతిషంలో స్త్రీ యొక్క అష్టమ భావాన్ని ధన భావంగా గుర్తించారు. స్త్రీ జాతకంలో అష్టమ రవి. ధననాశాన్ని ఇస్తాడు. రవి సింహంలో ఉంటే ఆమెకు ఖర్చు చేసే స్వభావం తక్కువగా ఉంటుంది. స్త్రీ జాతకంలో రవి బలంగా ఉంటే వివాహం సౌఖ్యాన్నిస్తుంది. స్త్రీ జాతకంలో సూర్యుడు సప్తమ దశమాల మధ్యలో కాని, లగ్న చతుర్థాల మధ్యలోకాని ఉంటే వివాహం తొందరగా అవుతుంది.

**అష్టమ భావం :-** ఆయుర్విచారణ, లగ్నాష్టమాలను అనుసరించి చేస్తారు. ఈ సందర్భంలో సూర్యుడున్న రాశి, చంద్రుడున్న రాశి కూడా లగ్నాలుగా భావించబడతాయి. మృత్యు కారణాన్ని తెలిసికోడానికి సూర్యలగ్నం, చంద్ర లగ్నం, అష్టమం పరిశీలించాలి. ఈ భావాలలో కుజాది పాపగ్రహాలుండి వానిపై శుభ గ్రహదృష్టులు లేకుంటే దుర్ఘటనల వల్ల మరణం చెప్పాలి. శుభ గ్రహాల ప్రభావం మాత్రమే ఉంటే సహజ మరణం చెప్పాలి.

**నవమ భావం :-** ఈ భావంలో సామాన్యంగా ధర్మం, తత్వ విచారం మొదలయినవి పరిశీలించాలి. విదేశి యాత్ర ఈ భావం ద్వారా

విచారించాలి. భారతీయ జ్యోతిషంలో దూర ప్రయాణాలు మాత్రమే చెప్పబడినవి. భారతీయ జ్యోతిషంలో నవమం పితృస్థానం దానికి కారణం నవమాత్తు పుత్ర స్థానం అయిన పంచమం లగ్నం కావటమే. పాశ్చాత్య జ్యోతిషంలో దశమం పితృస్థానం దానికి కారణం మాతృస్థానమయిన చతుర్థానికి సప్తమం దశమం కావటమే. కాని అనుభవంలో పరిశీలిస్తే ఆధ్యాత్మిక వారసత్వం నవమం నుండి, లౌకిక వారసత్వం దశమం నుండి పరిశీలించడం న్యాయమని తోస్తుంది.

**దశమ భావం :–** దీనిలో వృత్తిని పరిశీలించాలి. పాశ్చాత్య జ్యోతిషంలో 2,11 స్థానాలను కూడా పరిశీలిస్తారు. కీర్తి, యశస్సు కూడా దశమంలోనే చూడాలి. పదవి, ఉద్యోగం, ఉద్యోగంలో ఔన్నత్యం ఈ భావాన్నిచే పరిశీలించాలి. దశమంలో రవి కీర్తినిస్తాడు. చతుర్థాధిపతి అయిన శని దశమంలో ఉంటే అట్టడుగు స్థాయినుంచి అత్యున్నత స్థాయి చేరుకుంటాడు.

**ఏకాదశ భావం :–** ఇతరుల నుండి వచ్చే సహకారం, జీవనంలో విజయం ఈ భావాన్ని బట్టి పరిశీలించాలి. ఒక జాతకంలో కుజుడు ఏ రాశిలో ఉన్నాడో అదే రాశిలో శుక్రుడు ఇంకో జాతకంలో ఉంటే వారి మధ్య పరస్పర ఆకర్షణ ఉంటుంది. ఒక జాతకంలో శుక్రుడున్న చోట మరొక జాతకంలో సూర్య చంద్రులలో ఏ ఒక్కరున్నా పరస్పర ఆకర్షణ ఉంటుంది. ఒక జాతకంలో శుభ గ్రహం ఉన్న చోట మరో జాతకంలో సూర్య, చంద్రులలో ఒక్కరున్నా రెండవ జాతకం వల్ల మొదటి జాతకానికి లాభం కలుగుతుంది.

**ద్వాదశ భావం :–** కారాగారం, ఖర్చు, శత్రుత్వాలు రహస్య విషయాలు, ఆధ్యాత్మిక ఔన్నత్యం ఈ భావంలో పరిశీలించాలి. నవమానికిది చతుర్థం కావటం వల్ల ధర్మ, త్యాగం, దశమానికి తృతీయ కావటం వల్ల రాజ్యానికి బాహుశక్తి అయిన సైనిక శక్తి, చతుర్థానికిది నవమం కావటంవల్ల బంధు జనానికి అదృష్ట స్థానం ఇలా చాలా అంశాలు దీనిలో విచారించబడతాయి.

ద్వాదశంలో ఎడమ కన్ను సూచించబడుతుంది. చంద్రుడు ఎడమ కంటికి అధిపతి. నిర్బలుడయిన చంద్రుడు వ్యయంలో ఉన్నా, వ్యయానికిగాని, చంద్రునికి గాని పాపగ్రహ సంబంధమున్నా ఎడమకంటికి అనారోగ్యం. లగ్నానికి వ్యయం కావడం వల్ల మరణం విషయంలో కూడా ఈ భావాన్ని పరిశీలించాలి.

# గ్రహస్వభావాలు

**సూర్యుడు :–** దశమ సూర్యుడు కీర్తి, పదవి, గొప్పదనం ఇస్తాడు. లగ్న సూర్యుడు బలిష్ఠుడైతే తేజస్సును, బలహీనుడైతే శిరోరోగాన్ని ఇస్తాడు. సప్తమంలో సూర్యుడు అందరియందు సానుభూతిని ఇస్తాడు.

**చంద్రుడు :–** సామాన్యంగా కేంద్రాలలో బలవంతుడు. ధనమిస్తాడు. చతుర్థంలో ఆలోచనలకు ప్రాధాన్యతనిస్తాడు. చతుర్థచంద్రుడు మానసిక శక్తులనిస్తాడు. అతడే బలహీనుడైతే అనవసర భయాలను సృష్టిస్తాడు.

**కుజుడు :–** లగ్నంలో శక్తి, ఉత్సాహం, శీఘ్రగతిన పనులు నెరవేర్చుట మొదలైన ఫలితాలిస్తాడు. కాని ధైర్యం తగ్గిస్తాడు. దశమంలో కుజుడు సంకల్ప శక్తిని పాప గ్రహదృష్టులు లేకుంటే అందరికష్టాలలోను ఆదుకొనే సానుభూతినిస్తాడు.

**బుధుడు :–** 1,10 స్థానాలలో బలవంతుడు. ఏ ఇతర గ్రహాల ప్రభావం ఉందో వారి స్వభావాల అనుగుణమైన వృత్తిని ఇస్తాడు. మాట్లాడే శక్తిని, రచనా శక్తిని పెంచుతాడు. సప్తమ బుధుడు ఆలోచనలలో సమన్వయాన్ని, ప్రేమని ఇస్తాడు.

**గురుడు :–** లగ్నంలో గురుడు అనుభవ జ్ఞానాన్ని వ్యక్తిత్వ వికాసాన్ని, ఆలోచనా శక్తిని ఇస్తాడు. దశమ గురుడు గుణాలను పెంచుతాడు. పరోపకారం, సత్యప్రియత్వం, నైతిక నియమాలు సాంప్రదాయాన్ని గౌరవించడం, ఆదరించుట, వ్యక్తులను గౌరవించుట, దేశమందు ప్రేమ కల్పిస్తాడు. సప్తమగురుడు సామాజికంగా వ్యాపారపరంగా ప్రేమ, సానుభూతి మొదలగు గుణాలను ఇస్తాడు.

**శుక్రుడు :–** లగ్నంలో ప్రేమ, సంస్కారం, అందరికీ అనుకూలంగా ంచరించడం, సంగీతం, నృత్యం మొదలగునవి ఇస్తాడు. వృత్తిలో కూడా ంతని విద్య ఉపకరిస్తుంది. దశమ భావంలో ధనం, గౌరవం ఇస్తాడు.

సప్తమ శుక్రుడు సమాజ సేవాదృక్పథాన్ని, సానుభూతిని ఇస్తాడు. శుక్రుడు పాపగ్రహ సంబంధం లేనివాడైతే కవితా శక్తిని ఇస్తాడు.

**శని :-** లగ్న శని స్వార్థాన్ని, శ్రమపడే స్థైర్యాన్ని, ధైర్యాన్ని, సంకల్ప శక్తిని ఇస్తాడు. దశమంలో కూడా ఆ గుణాలు పెంచుతాడు. సప్తమంలో కూడా శని బలవంతుడే. ఇది ఆలస్యంగా నడిచే గ్రహం. సూర్యుడున్న రాశినుండి 6,7,8 స్థానాల్లో వుంటే నిశ్చయాత్మకమైన బుద్ధిని ఇస్తాడు. కుజాది పాపగ్రహ సంబంధం లేకపోతే న్యాయ ప్రియత్వాన్ని ఇస్తాడు.

**యురేనియస్ :-** 1, 10 స్థానాలలో వుంటే నిశ్చయాత్మక బుద్ధి, దృఢ సంకల్పం ఇస్తాడు. చతుర్థ భావంలో బలహీనుడైతే చెడ్డ ప్రభావం కలిగిస్తాడు. సప్తమంలో తీవ్రబుద్ధి, సానుభూతి లేకపోవడం మొదలైన ఫలితాలు ఇస్తాడు.

**నెఫ్ట్యూన్ :-** 4 ఇతనికి మంచిది. మిగిలిన కేంద్రాలలో ఇతరుల భావాలను గ్రహించే నేర్పునిస్తాడు.

**ప్లూటో :-** ఇతడు 1930లో గుర్తించబడ్డాడు. ఫలితాలు ఇంకా పరిశీలించబడుతున్నాయి. యురేనస్‌ను పోలి వున్నట్లుగా జ్యోతిష్కులు గుర్తిస్తున్నారు.

# గ్రహములు - చిహ్నములు

| గ్రహము | చిహ్నము |
|---|---|
| సూర్యుడు | ☉ |
| చంద్రుడు | ☽ |
| కుజుడు | ♂ |
| బుధుడు | ☿ |
| గురుడు | ♃ |
| శుక్రుడు | ♀ |
| శని | ♄ |
| రాహువు | ☊ |
| కేతువు | ☋ |
| యురేనస్ | ♅ |
| నెప్ట్యూన్ | ♆ |
| ప్లూటో | ♇ |

గ్రహాలకు ఈ విధమైన సంకేతాలు ఉపయోగిస్తూంటారు. వీనిలో ప్రత్యేకమైన అంతరార్థాలు ఉన్నాయి. చుట్టూ సున్న మధ్యలో చుక్క. చుట్టూ వున్న సున్న హద్దుల్లేని తనాన్ని సూచిస్తుంది. పాశ్చాత్య జ్యోతిషంలో భూమికి '⊕' వాడుతారు. ఒక వృత్తాన్ని రెండు వ్యాసాల ద్వారా గుర్తించాలంటే ఒకదానిపై మరొక గీతను లంబంగా గీయడం జరుగుతుంది. ఈ సూర్యుడు కేంద్ర బిందువు. ఆ సూర్యుని అనంతమైన శక్తి వలన భూమిమీద సకలచరాచర జీవులు జీవ శక్తి కలిగి ఉన్నాయి. సూర్యుని

ప్రభావం వల్ల జన్మించిన వ్యక్తి నలుగురికి తాను కేంద్రంగా ఉంటూ ఇతరుల కార్యకలాపాలపై తన ప్రభావం చూపుతూ ఉంటాడు.

మధ్యకేంద్ర బిందువు చుట్టూ ఉన్న సున్న సూర్యుని చుట్టూ తిరిగే గ్రహాలకు సంకేతం. నిరంతర చలనం గల ప్రకృతికిది సంకేతం.

ప్రాచీన జ్యోతిష్కులు సూర్యుడు ఒక ప్లానెట్ అని మిగిలిన గ్రహాలవలె ప్రతిరోజూ దాటుతున్నాడని భావించారు. మనకి అతి దగ్గరగా ఉండే నక్షత్రం. బలానికి, తెలివితేటలకు, ప్రతిష్ఠ మొదలగు వాటికి మరియు మనిషి తనంతటతాను కార్యక్రమాలు జరుపుకోనే శక్తికి సంకేతం.

**చంద్రుడు :–** మనస్సుకు సంకేతమైన గ్రహం ప్రతి ఆలోచనకు రెండు కోణాలున్న రీతిలో ఈతనికి గల సంకేతం రెండు కోణాలు కలిగి ఉంటుంది.

**కుజుడు :–** వృత్తానికి పైన ఒక బాణం కుజుని యొక్క చిహ్నంగా భావించబడుతోంది. వృత్తం ఆధ్యాత్మికతకు, పైన వున్న బాణం భూమి అని భావించారు. దీనిని వేరే విధంగా చెప్పాలంటే ఆధ్యాత్మికతత్వంపైన భౌతికతత్వాన్ని చూపించడమే. కుజుని ప్రభావంవల్ల భౌతికత్వం ఆధ్యాత్మికతత్వంమీద విజయం సాధిస్తోంది. దానికి కారణం కుజుని ప్రధానమైన లక్షణం భౌతికత్వం.

**బుధుడు :–** సూర్యునికి దగ్గరగా వుండే గ్రహం బుధుని యొక్క చిహ్నం మూడు వేర్వేరు గుర్తులు ద్వారా తయారయినది. అన్నిటికంటే అడుగున వున్న + భౌతికత్వాన్ని మధ్యలో వున్న వృత్తం ఆధ్యాత్మికతకు పైన గల అర్ధచంద్రాకృతి మనసును తెలియజేయును. ఈ గుర్తు మిశ్రమమైనది. అనేక సంస్కారాల కలయిక మనకు కన్పించును. చంద్రుని యొక్క స్థితి బుద్ధికి ప్రతీక.

**గురుడు :–** గురుని చిహ్నాన్ని పరిశీలించినపుడు కుడివైపు భాగం ఆధారంగాను, ఎడమ వైపు పై వైపుకి వుండే చిహ్నం.

దీని అర్థం ఇది (గ్రహం) భౌతిక విశాలతను తెలియజేస్తుంది. ధనం, కుటుంబం, జ్ఞానం మొదలైనవి దీనిలోని అంతర్గతాలు.

**శుక్రుడు :-** వృత్తము ఆధ్యాత్మికతకు అందరిని ఆకట్టుకొనుటకు సంకేతకంగాను + భౌతికకు గుర్తు. ఈ గ్రహం క్షుద్రతను విడిచి విశాల భావనకి సౌందర్యానికి సంకేతంగా నిలుస్తుంది.

**శని :-** ఎడమ వైపుకున్న గుర్తు ఆధారంగాను కుడివైపు ఉన్న గుర్తు అధో: దృష్టికి సంకేతంగా నిలుస్తుంది. భౌతికత్వంలో మనిషి మునుగుటకు ఈ చిహ్నం గుర్తు. చేతనాచేతనాలు నాశనం, సేవా జీవనం మొదలగు వాటిని ఈ గుర్తు సూచించును.

**రాహువు :-** దీనిలో ఆరోహానికి సంకేతంగా గుర్తు వుంది. ఇతడు చంద్రునికి ఆరోహసంపాతము. అందుచే ఈ గుర్తు ఇవ్వబడింది.

**కేతువు :-** ఇతని గుర్తు అవరోహణానికి సంకేతంగా వుంటుంది. రాహువునకు $180^0$ దూరంలో వ్యతిరేక దిశలో వున్నందున కేతువు అవరోహణకు సంకేతం అయినాడు.

**యురేనస్ :-** హెర్షల్ అనే శాస్త్రవేత్త దీనిని కనుగొనడం వలన ఆ 'H' అనే అక్షరాన్ని ఇతని లక్షణాలలోని విశాలభావాలను సూచించే విధంగా ఒక సున్నా కలుపుతూ ఈ గుర్తు కనిపిస్తోంది.

**నెప్ట్యూన్ :-** సంహారక శక్తికి సంకేతమైన త్రిశూలమునకు దగ్గరగా వుండే ఈ గుర్తు నెప్ట్యూన్‌లోని సంహారక శక్తి సంకేతంగా అనిపిస్తుంది. కఫవాతపిత్తములు అనే మూడు ప్రకృతుల ప్రేరణకు ఇది సంకేతం.

**ప్లూటో :-** సౌర కుటుంబంలో చివరి గ్రహం. అనంతానంద స్వరూపమైన అలౌకికానందానికి సర్వతోముఖమైన భౌతిక వృద్ధికి సంబంధం తెగిపోయిన రూపంలో ఆధారమునకు పై సున్నకు అనుబంధం లేని ఈ గుర్తు ఫలితాన్నాశించని కృషికి, మరణానికి నిర్లిప్తతకు సంకేతంగా భావించవచ్చును.

# గ్రహాల స్వరూపాలు, కారకత్వాలు సహేతుక దృష్టి

**సూర్యుడు :-** ఆత్మస్వరూపుడు. మానవుని శరీరంలో అహంకార (ego) రూపంలో కనిపిస్తూంటుంది. చాలా సూక్ష్మమైన ఊహకందని అప్రత్యక్ష సత్యాలకిది సంకేతం. సూర్యుడు లగ్నంలో ఉంటే శరీరానికి పుష్టి, ఎముకల శక్తి అధికం. ముఖం విశాలంగా ఉంటుంది. లగ్నంలో బలంగా సూర్యుడున్నా చక్కని నేత్ర శక్తిని ఇస్తాడు. కపటం లేకపోవడం, గాంభీర్యం, గొప్పతనమందలి ఆకాంక్ష, గౌరవం, ఆత్మాభిమానం మొదలైన లక్షణాలను ఇస్తాడు. సూర్య రాశి కూడా ఒక లగ్నం కావడం వల్ల అతడే లగ్నంలో వుండి పాపగ్రహ దృష్టి లేనివాడైతే ఆయువును వృద్ధి చేస్తాడు. దశమంలోని సూర్యుడు ఔన్నత్యాన్ని, పదవిని, గౌరవాన్ని, ఆత్మవిశ్వాసాన్ని ఇస్తాడు. సప్తమంలో సూర్యుడు సామాజిక సంబంధాలని ఇస్తాడు. అతడే దుర్బలుడైతే భాగస్వాములతో విరోధం, స్త్రీలతో విరోధం, సామాజిక సంబంధాలకు దూరంగా వుండడాన్ని ఇస్తాడు. చతుర్థస్థానంలో సూర్యుడుంటే తల్లిదండ్రులకు సంబంధించిన ఆలోచనలు ఇస్తాడు.

సౌర మండలంలో ఇతడు ముఖ్య గ్రహం. రాజు. రాజ్య పదవి, గౌరవం, ఆత్మవిశ్వాసం, ముఖ్యుడు, కొందరు జనాలకు ప్రతినిధి, చక్కని విశాలమైన ఎత్తైన ప్రదేశాలలో నివాసం కలిగి ఉండడం, రాజ భవనం, రాజధాని మొదలైన వాటికి ప్రతీక. పద్మం వంటి రంగుకు ఇతడు ప్రతినిధి. కెంపు, బంగారం ఇతనికి చెందినవి. అధికారం, గర్వం, బలమైన కోరిక ఇతనికి చెందిన మనోభావాలు. శరీర భాగాలలో హృదయం ఇతనికి చెందినది. వెన్నెముక ఇతనికి చెందినదే. కన్నులకు ఇతడు అధిపతి. కోపానికి అధిపతి.

**చంద్రుడు :-** చంద్రుడు భౌతిక శరీరానికి చెందినవాడు. సూర్యుని నుండి కాంతి తీసుకొని ప్రతిఫలిస్తాడు. ఆత్మ నుండి జ్ఞానాన్ని తీసుకొని ఆలోచనతో వికసింప చేసే మనసుకితడు అధిపతి. ప్రతిబింబిత జ్యోతి

కావడం వల్ల రాణికి, గృహిణికి ఇతడు సంకేతం. ఎడమ కంటికి అధిపతి. చల్లదనాన్నిస్తాడు. కాబట్టి జలగ్రహం.

అతిశీఘ్రగతి కలవాడు కావడంవల్ల మనసుకు అధిపతి. మనోగమనానికి రక్తవేగానికి సంబంధం కలిగి ఉండడం వల్ల జలపదార్థం రక్తంలో ఎక్కువ ఉండడం వల్ల రక్తానికి కూడా ఇతడే కారకుడు. సూర్యుని నుండి శక్తి తీసుకొని అందరికి పంచుతున్నందు వలన స్త్రీ, తల్లి ~~ఈ~~తని కారకత్వాలలోకి వస్తారు. నౌకాధళం, నీటి సరఫరా, కాలువలు, నదులు, జలాశయాలు, జల సంబంధమైన షోడాలు, డ్రింక్‌లు మొదలైన వాటికి అధిపతి ఇతడే. ఆహార ద్రవ్యాలతో ఇతనికి సంబంధం ఎక్కువ. తెలుపు, వెండి, ముత్యం ఇతనికి చెందినవే. చలన శక్తి బాల్యంలో అధికంగా వుంటుంది కాబట్టి ఇతడు బాల్యానికి అధిపతి. నీటికి మనసుకు గల సారూప్యం విశిష్టమైనది. మనుష్యుల భావనలు కోరికలు ఆకాంక్షలు, వేదనలు గ్రహణ శక్తి ఇతనికి చెందినవే. వక్ష స్థలం ఇతనికి సంబంధించినదే. కళల వృద్ధిక్షయాలు వున్న విధంగా వ్యక్తి మనసులోని ఉత్తేజం నిరుత్సాహం అనే వాటికి కూడా ఇతడే కారకుడు. చంద్రుని పై పాపగ్రహ ప్రభావం ఉంటే ఆయుర్దాయం తగ్గడం, బాలారిష్టాలు ఇతడు కలిగిస్తాడు. ఇతడు జలగ్రహం కాబట్టి ఇతడు లగ్నంలో ఉంటే ఊబ ఒళ్ళు వస్తుంది. చంద్రుని కేంద్ర దృష్టి మానవునిలో అస్థిరత మార్పు, అపకీర్తి, పతనం, హాని కలిగిస్తాడు. ఎలెన్ లియో అభిప్రాయం ప్రకారం యురేనస్‌పై చంద్రుని శుభ దృష్టి వలన జ్యోతిష పరిజ్ఞానం సిద్ధిస్తుంది.

**కుజుడు :-** ఇతడు సేనావిభాగానికి, విద్యుత్, రేడియో మొదలగు రంగాలలో, ఇంజనీరింగు విభాగాలలో ఇతనికి సంబంధం ఉంది. కండరాలు, శక్తి, ఉత్సాహం, రక్త రోగాలు, వేడి, జ్వరం, హింసాత్మక ప్రవృత్తి, సూక్ష్మ పరిశీలనా శక్తి, ఆలోచన, అవగాహన, కోపం మొదలగు వాటికి ఇతడు అధిపతి. శరీరం, సన్నగా, గట్టిగా ఉంటుంది. ఎరుపు రంగు శరీరం జుట్టు రంగు నలుపు, తీక్ష్ణ దృష్టి, ఆత్మవిశ్వాసం, ధైర్యం, కృషిశీలత, భయం

లేకపోవడం, పరాక్రమం మొదలైనవాటికి అధిపతి. శరీరంపై రోమములెక్కువగా ఉంటాయి. శిరస్సు చిన్నదిగా ఉంటుంది. సంఘర్షణ అంటే యిష్టం, ఉగ్రస్వభావం. తార్కిక శక్తి, యుద్ధప్రియత్వం. దోషి అయిన కుజుడు ఉద్దతత్వాన్ని, కలహశీలాన్ని, హింసా ప్రవృత్తిని, చౌర్యాన్ని, వ్యభిచార దురాచారాన్ని, దేశద్రోహం, అమానుష ప్రవృత్తి కృతఘ్నత, ఉగ్రత, భయంకరత్వం ఇస్తాడు.

**బుధుడు :–** సూర్యునికి దగ్గరగా ఉండే గ్రహం. అందువల్ల కాంతి, విద్య, బుద్ధికుశలత ఇతని లక్షణాలు. విద్య బాల్యానికి సంబంధించింది కావడంవల్ల ఇతడు కుమారుడు. శాస్త్రాలు, నూతన విషయాలు ఇతనికి ఆసక్తినిస్తాయి. మెదడు, ఆలోచన, పరిశీలనాశక్తి, సమయ స్ఫూర్తి, విజ్ఞానం, సూక్ష్మ పరిశీలన, అంతఃస్ఫురణ, చైతన్య శక్తి మొదలైన వాటికితడు అధిపతి. రాహువు, శని, సూర్యుడు మొదలైన గ్రహాల సంబంధంవల్ల స్ఫురణ శక్తి లోపిస్తుంది. లేఖన శక్తి, పఠన శక్తి, గణిత శాస్త్రజ్ఞుడు, గుమాస్తా, లెక్కలు చూచువాడు, పుస్తక ప్రచురణ, సమాచార శాఖ, పత్రికా సంపాదకత్వం, ఉపన్యాసకుడు, న్యాయవాధి, వాఖ్యాత, ఉపదేశకుడు, వ్యాపార వేత్త, రాయబారి, ఆకుపచ్చ రంగు ఇతనికి చెందినవి. రత్నాలలో పచ్చకు అధిపతి. కాల పురుషుని శరీరాంగాలలో మూడు, ఆరు స్థానాలకు ఇతడు అధిపతి. కంఠం, నరాలు, పొత్తి కడుపు, బాహువులు మొదలైన వాటికధిపతి. బుధుడు ఆధ్యాత్మిక చింతనకు ప్రతీక. ఈ స్థితిలో స్త్రీ పురుష భేదం ఉండదు. అందుకే ఇతడు నపుంసకుడు. స్వతంత్ర ప్రవృత్తి లేని వాడు కావడంవల్ల పాపులతో కలిస్తే పాపిగా, శుభులతో కలిస్తే శుభుడుగా ఇతడు మారుతుంటాడు.

**గురుడు :–** ధనుర్మీనాలకధిపతి. ధర్మమునకు, త్యాగమునకు, గృహములకు, ఆలయములకు, శాస్త్రజ్ఞతకు, సామాజిక సుఖానికి ఇతడు అధిపతి. మతాధిపతి, న్యాయాధిపతి, న్యాయవాది, జ్ఞానము, మేధావి, వైజ్ఞానికుడు, గౌరవం, ధనం, సలహాలిచ్చువాడు, ఉపదేశకుడు మొదలైన

అంశాలపై ప్రభావం చూపిస్తాడు. పుష్య రాగానికి, పసుపు రంగుకు, విషయ విస్తరణకు, సంతతికి శరీరంలో ఆమాశయానికి అధిపతి అవుతాడు. ఇతడే దుర్బలుడైతే ఆడంబరానికి ధార్మికుడుగా నటించుటకు కారకుడు. బలం గల గురుడు ధార్మికునిగా, వైజ్ఞానికునిగా తీర్చిదిద్దుతాడు. శరీర పుష్టి, సంభాషణా శక్తి ఇస్తాడు. ధనానికి లోపం లేదనే భావనను, ఇబ్బంది లేని పరిస్థితిని, అత్యాశ లేకపోవడాన్ని ఇస్తాడు.

**శుక్రుడు :-** ఈ పదం వీర్యానికి పర్యాయ పదం. ఆ ధాతువుకితడు అధిపతి. వివాహం, స్త్రీ, ఊహలు, కవిత్వం, కంఠం, జననేంద్రియాలు, సౌందర్యం, ముఖం మొదలైన వాటికి అధిపతి. కళలు, బంగారం, నాట్యం, అలంకార వస్తువులు, విలాస వస్తువులు, సౌందర్య సాధనాలు, భోగానుభవానికి సంబంధించిన వస్తువులు, వినోద వస్తువులు, వజ్రం, నలుగురితో పనిచేసే వృత్తులు ఇతని అధికారంలో వుంటాయి. ప్రేమకు ఇతడు అధిపతి. సంగీతం, సాహిత్యం మొదలైన వాటికి అధిపతి. ఈ శుక్రుడు దుర్బలుడైతే కృత్రిమత్వం, దొంగప్రేమ మొదలైన వాటికి కారకుడు. భారతీయ జ్యోతిషంలో శుక్రుడు స్త్రీ కారకుడు. గురుడు పతి కారకుడు. పాశ్చాత్య జ్యోతిషంలో శుక్ర, చంద్రులు భార్యా కారకులు. రవి, కుజులు భర్తృ కారకులు. ''కన్యా వరయతే రూపం'' అన్నట్లుగా భారతీయ స్త్రీలు పురుషుని అందానికి ప్రాముఖ్యం ఇస్తారు. పాశ్చాత్య స్త్రీలు భర్త యొక్క అధికారాన్ని, సాహసాన్ని అభిమానిస్తారు. సాహసానికి కుజుడు, అధికారానికి రవి అధిపతులుకాగా మంచితనానికి గురుడు అధిపతి.

**శని :-** ముక్కు, నాడులు, ధైర్యం, సంకల్ప శక్తి, బాధ్యత, గాంభీర్యం, సేవ, ఉద్యోగం తన స్థాయి కంటే తక్కువ పనులు చేయడం, అధో దృష్టి, ఇతరుల ప్రేరణ వుంటేనే కృషి చేయడం, నెమ్మదిగా నడవడం, ధనం విషయంలో అసంతృప్తి, ఆలోచిస్తూ తాపీగా పనిచేయడం, ఫలసిద్ధిపై విశ్వాసం, తక్కువ ఖర్చు చేయడం మొదలైన లక్షణాలకు అధిపతి. వ్యవసాయం, శ్రామికుడు, వృద్ధుడు, విరాగి, సంప్రదాయాభిమాని,

భిక్షుకుడు, విదూషకుడు, ఇనుము పనివారు, కుండల పనివారు, అబద్ధపు సాక్ష్యాలు చెప్పేవారు, ఆయుధాలు తయారుచేసేవారు, వంటవారు, మాలిన్యాలను తొలిగించేవారు, శవ వాహకులు, జుట్టును కత్తిరించేవారు, బొగ్గు వ్యాపారులు, బళ్ళు నడిపేవారు, దండలు గుచ్చేవారు, నల్లబట్టలు శని ప్రభావానికి లోబడి ఉంటాయి. పళ్ళ రోగాలు, చెవి రోగాలు, చలి జ్వరం, ఉష్ణ జ్వరం, వైద్యంపై అశ్రద్ధ వల్ల వచ్చే రోగాలు, రక్త పిత్తం, క్షయ, కామిర్లు, పక్షవాతం, కంపాలు, ప్రయోజనం లేని ఆలోచనలు మానసిక అనారోగ్యాలు, భయం, పిచ్చి, జలోధరం, సంధి వాతం, రక్త స్రావం, ఎముకలు బలహీన పడడం, విరగడం మొదలైన అనారోగ్యాలకు శని కారకత్వం ఉంది. సింహ, వృశ్చికాలలో శని వున్నా, శుక్రుని అశుభ దృష్టి పొందినా శని బలహీనుడవుతాడు. అలాంటి బలరాహిత్యం రోగ కారణమయ్యే అవకాశముంది.

**యురేనస్ :-** రహస్యాలు, గుప్త విషయాలు, గుప్త విద్యలు ఈ గ్రహానికి చెందినవి. సిద్ధులు, భవిష్య వాణి, మెస్మరిజం మొదలగునవి. ఈ గ్రహం ఇచ్చే అనారోగ్యాలు స్వరూపం అర్థం కాకుండా అసాధ్య రోగాలుగా మిగిలి పోతూంటాయి. ఈ గ్రహం స్వతంత్ర ప్రియత్వాన్నిస్తాడు. ఇతడు కుంభ రాశి అధిపతి అని భావిస్తారు. సూర్యుని స్వభావం కలవాడు అందువల్ల రాజు, ప్రధాన మంత్రి, పెద్ద పెద్ద అధికారాలు కలవారు, ఆఫీసర్లు ఇతని ప్రభావం కలవారు. సామాన్యంగా దొరకని వస్తువులు ఇతని ఆధిపత్యానికి చెందినవి. ఆలాటి వస్తువులను సమకూర్చే వ్యక్తి, తాంత్రికుడు, నూతనావిష్కర్త. ఈ గ్రహ ప్రభావానికి చెందినవారే. యురేనియమ్ అనే ధాతువు ఈ గ్రహానికి చెందినది. ఈ గ్రహం స్వతంత్ర భావాల్ని ప్రేరేపించినందు వలన అన్నింటికి తన నిర్ణయమే గొప్పదనే భావనవలన ఇతరుల మాటలకు, సంప్రదాయ బద్ధమైన మాటలకు విలువ ఇవ్వడు. క్రొత్త క్రొత్త పదార్థాలు, మార్గాలు, క్రొత్త చైతన్యం, క్రొత్త అనుభవాలు అభిలషిస్తుంటాడు.

ఈ గ్రహం ఆకస్మికంగా జరిగే పనులకు, సంఘటనలకు అధిపతి. సంకల్ప శక్తి, బలమైన కోరిక, పూర్తిగా ఆలోచించే శక్తి, దీని వలన కార్య సాధన జరిగేలా చేసే సామర్ధ్యానికి ఇతడు అధిపతి. మానవుని జీవనంలో ఆకస్మికంగా మార్పులను తీసుకురావడంలో ఈ గ్రహం ప్రసిద్ధుడు. అతడున్న రాశి ఏ దిక్కుకు చెందినదో ఆ దిక్కుకు ఆ మార్పు సంభవిస్తుంది.

**నెప్ట్యూన్ :-** ఇతని లక్షణాలు శని స్వభావానికి దగ్గరగా ఉంటాయి. శని వలే ఇతడు కూడా సామాన్య జనాల అభివృద్ధిని కోరుతాడు. ఆధ్యాత్మిక జ్ఞానం, మనో విజ్ఞానం, వైరాగ్యం, ఉదాశీన వైఖరి మొదలైన భావాలపై ఇతని ఆధిపత్యం ఉంది. హాస్పిటల్స్ ఇతని కారకత్వానికి చెందినవే. మనోభావాలు, ఆలోచనలు ఇతని ప్రభావానికి లోనయి ఉంటాయి. భౌతిక శరీరంపై ఇతని ప్రభావం లెక్కించ దగనిది. ఆధ్యాత్మికౌన్నత్యానికి ఇతని ప్రభావం కారణమే అవుతూంటుంది.

**ప్లూటో :-** ఇతని లక్షణాలు అగ్నితత్వానికి చెందినవై ఉంటాయి. విష వాయువుల ప్రభావం అలాంటి కర్మాగారాలు. ప్రతిశక్తివంతమైన కిరణాలు వాటివలన కలుగు దుష్ప్రభావాలు ఆనారోగ్యాలు అకారణమైన అశాంతి మొదలైన అంశాలు ఇతని ప్రభావానికి లోబడి ఉంటాయని గుర్తించవచ్చు.

# గ్రహాలు - ఆధిపత్యాలు

గ్రహాలకు, రాశులకు గల సంబంధాలు భారతీయ జ్యోతిషంలోనూ, పాశ్చాత్య జ్యోతిషంలోనూ ఏకీభవిస్తూంటాయి.

గ్రహ రాజ్యంలో రవి రాజు, చంద్రుడు రాణి, కుజుడు సేనా నాయకుడు, బుధుడు యువరాజు లేదా వ్యాపారి. గురుడు నిస్వార్థంగల మంత్రి. శుక్రుడు స్వార్థం గల మంత్రి. శని సేవకుడు. యురేనస్ కార్మిక నాయకుడు. నెప్ట్యూన్ కవి. ప్లుటో శిక్షకుడు.

సింహం మృగరాజు కావడం వల్ల గ్రహ రాజైన రవికి అది స్వక్షేత్రం. రాజుని అనుసరించి ఉండే రాణికి (చంద్రుడు) సింహం ప్రక్కనే ఉన్న కర్కాటకం స్వక్షేత్రం. కర్కాటకం స్త్రీ రాశి కావడం కూడా గమనించాలి. విశేషించి స్త్రీకి భీత హరిణేక్షణ అని పేరు. ఆ భయం కర్కాటకంలో (పీత) కనిపిస్తుంది.

కుజుడు సేనా నాయకుడు. సేన రెండు రకాలు. సైన్యం, గూఢచారి వర్గం. కొండనైనా ఎదిరించే పొట్టేలు ధైర్యానికి, యుద్ధప్రీతికి సంకేతం. అదే మేషం. తేలులోగల ఆత్మరక్షణ రహస్య సంచారం (వృశ్చికం) గూఢచారి వర్గంలో తప్పనిసరి. ఆ రెండింటికి సేనా నాయకుడైన కుజుడే అధిపతి.

వ్యాపారియైన బుధునికి అమ్మకం, కొనుగోలు ముఖ్య క్రియలు, అమ్మకానికి ఆకర్షణ, కొనడానికి ద్వంద్వ వైఖరి ముఖ్యమైనవి. ద్వంద్వ వైఖరికి మిథునం ప్రతీక.

భారతీయ జ్యోతిష పద్ధతిలో మిథునాన్ని దంపతులన్నా పాశ్చాత్య జ్యోతిష పద్ధతిలో మిథునాన్ని కవల పిల్లలు అని అన్నా ఇద్దరున్న చోట ద్వంద్వ ప్రకృతి సహజం. కాబట్టి మిథునం కొనుగోలు శక్తికి సంకేతం, కన్యలోని ఆకర్షణ వ్యాపారికి అమ్మకాలు పెంచుకోవడానికి ఉపయోగపడుతుంది. మిథున, కన్యలకు బుధుడు అధిపతి కావడం సహజమే.

స్వార్థంలేని మంత్రి గురుడు మేధావి. అతనికి రెండు శక్తులున్నాయి. నూతన వస్త్వావుత్పత్తి, నూతన సాహిత్యోత్పత్తి. వస్త్వావుత్పత్తికి లక్ష్య సాధనా శక్తి ముఖ్యము. ఆ లక్ష్య సాధన ధనుస్సులో ఉంది. కవిలోని ఊహా శక్తి మీనంలో ఉంది. ఆ రెండింటికి అధిపతి గురుడే కావడం పూర్తిగా సహేతుకం.

శుక్రుడు స్వార్థంగల మంత్రి. మరో మేధావి. ఇతడు బాధ్యత నెత్తిపై వేసుకుంటాడు. పేరు కోసం ఇరువురి గొడవలో తీర్పు చెప్పి ఇద్దరి మెప్పు పొందుతాడు. బాధ్యత వేసుకోవడం ఎద్దు (వృషభం) లో కనిపించే లక్షణం. తీర్పు చెప్పడం తులలో దర్శనమిస్తుంది. ఆ రెండింటికి అధిపతి శుక్రుడే.

సేవకులు రెండు రకాలు. పట్టుదలతో పనిచేసేవారు, బద్ధకించేవారు. మకరం (మొసలి), పట్టుదలకు మొసలిపట్టు ప్రతీక. బద్ధకానికి కుంభం ప్రతీక. ఆ రెండింటికి అధిపతి శని కావడం సహేతుకమే.

శని లక్షణాలలో సంకల్ప శక్తికూడా ఉంది. సంకల్పమాత్రంచే పనులు సాధించే నేర్పు గల కార్మిక నాయకుడు. యురేనస్ ఇతడిని ప్రజాపతి అని గాని ఇంద్రుడు అని గాని వ్యవహరిస్తాడు. తాను పని చేయకుండా ఇతరులచే పని చేయించడం బద్ధకస్తుని పని. కార్మిక వర్గం కూడా శని ఆధిపత్యం కలదే. అలాంటి లక్షణాలుగల యురేనస్‌కు కూడా కుంభంపై ఆధిపత్యం ఇవ్వడం న్యాయమే అవుతుంది.

ఊహాశక్తికి నెప్ట్యూన్ మూలం, కవికి ఊహాశక్తి ముఖ్యం. అలాంటి లక్షణాలు గల రాశి మీనం. దానిపై నెప్ట్యూన్‌కి గురునితో పాటు ఆధిపత్యం ఇవ్వడం సహేతుకమే.

ప్లూటోని యముడని వర్ణిస్తున్నారు. యముడు శిక్షకుడు. వృశ్చికాది విష జంతువులన్నీ యమ లక్షణం గలవిగానే వర్ణించారు. అందువలన వృశ్చికంపై యమునకు ఆధిపత్యం హేతు బద్ధమే.

| రాశులు | అధిపతులు |
|---|---|
| మేషం | కుజుడు |
| వృషభం | శుక్రుడు |
| మిథునం | బుధుడు |
| కర్కాటకం | చంద్రుడు |
| సింహం | రవి |
| కన్య | బుధుడు |
| తుల | శుక్రుడు |
| వృశ్చికం | కుజుడు - ప్లూటో |
| ధనుస్సు | గురుడు |
| మకరం | శని |
| కుంభం | శని - యురేనస్ |
| మీనం | గురుడు - నెప్ట్యూన్ |

స్వక్షేత్రంలోని గ్రహం ఉత్తమ ఫలదాత. గౌరవాన్వితుడు అని పాశ్చాత్య జ్యోతిషం వ్యవహరిస్తోంది.

స్వక్షేత్రానికి సప్తమ రాశి ఆ గ్రహానికి పతన స్థానమని పాశ్చాత్య జ్యోతిషం గుర్తిస్తుంది. ఈ అంశం భారతీయ జ్యోతిషంలో కానరాదు. స్వక్షేత్రం స్వాతంత్ర్యానికి ప్రతీక. దానికి సప్తమ రాశి అస్వతంత్రక్షేత్రంగా గుర్తించవచ్చు. అస్వతంత్రక్షేత్రంలో ఉన్న గ్రహం ప్రభావం వల్ల అస్వతంత్రుడు అవుతాడు. ఇతరుల నిర్ణయాలు అంగీకరించవలసిన స్థితిని పొందుతాడు. దానిని పతనంగానే పరిగణించవచ్చు.

| గ్రహాలు | అస్వతంత్రక్షేత్రాలు |
|---|---|
| ర | కుంభం |
| చ | మకరం |
| కు | వృషభం, తుల |
| బు | ధనుస్సు, మీనం |
| గు | మిథునం, కన్య |
| శు | మేషం, వృశ్చికం |
| శ | సింహం, కర్కాటకం |
| యు | సింహం |
| నె | కన్య |
| ప్లూటో | వృషభం |

# ఉచ్ఛ - నీచలు

వ్యక్తి ఉన్నతంగా రాణించడానికి ఆదర్శం ముఖ్యం. ఆ ఆదర్శం వల్ల వ్యక్తి ఉన్నతుడవుతాడు. గ్రహం ఉచ్ఛలో వుంటే ఆదర్శంతో రాణిస్తాడు. ఆదర్శానికి వ్యతిరేకం స్వార్థం. స్వార్థంతో వ్యక్తి ఆత్మ రక్షణ చేసుకోగలడుగాని రాణించలేడు కదా.

ఉచ్ఛ - Exhalted
నీచ - Debilitated

అని వ్యవహరిస్తారు.

## రవికి ఉచ్ఛ మేషం - నీచ తుల

రాజుకి సైన్యాధ్యక్షుని (మేషం) వద్ద రాణింపు ఉంటుంది. అదే రాజు తీర్పులు చెప్తుంటే (తుల) యుద్ధ భయం ఉండదు, ఆత్మ రక్షణ వుంటుంది. కాని రాజుగా రాణింపుండదు.

## చంద్రునకు వృషభం ఉచ్ఛ - వృశ్చికం నీచ

రాణి (చంద్రుడు) గారికి బాధ్యత వహించే మంత్రి ఉండగా రాణింపు ఉంటుంది. వాస్తవాలను అందించి అంతటితో బాధ్యతను పూర్తి చేసుకొనే తత్వం గల గూఢచారి వద్ద (వృశ్చికం) రాణి రాణించలేదు. రక్షణ మాత్రమే లభిస్తుంది.

## కుజునకు మకరం ఉచ్ఛ - కర్కాటకం నీచ

సైన్యాధ్యక్షుడు పట్టుదలగల సైన్యం (మకరం) వద్ద రాణిస్తాడుగాని భయ స్వభావం గల రాణి (కర్కాటకం) వద్ద రాణించలేడు. యుద్ధంలో రాణింపుతో బాటు సాహసం వుంది. విజయం పొందవచ్చు, పొందకపోవచ్చు. విజయం పొందినా, మరణం పొందినా, గౌరవం సిద్ధిస్తుంది. ఆత్మరక్షణ వుంటుంది అనే ధీమా లేదు భయస్థురాలైన రాణివద్ద రాణింపు లేకున్నా ప్రాణరక్షణ ఉంటుంది.

## బుధునికి కన్య ఉచ్ఛ - మీనం నీచ

వ్యాపారస్థునికి జ్ఞాపకశక్తి ముఖ్యం. కన్యా రాశి జ్ఞాపక శక్తికి సంకేతం. వ్యాపారస్థుడు ఎంతటి వాడైనా స్వస్థానంలోనే (వ్యాపారం చేసే చోటు) రాణిస్తాడు. మన వద్దకు వచ్చి అమ్ముతానంటే ''కాళ్ళ వద్దకు వచ్చిన బేరం కాశి వెళ్ళినా దొరకదు''. కాబట్టి మనం ఇష్టం వచ్చిన రేటుకి అడుగుతాము. కాబట్టి వ్యాపారస్థుడు స్వస్థానంలోనే రాణిస్తాడు. శ్రమ ఉంటుంది. జ్ఞాపక శక్తికి వ్యతిరేకం ఊహా శక్తి అది మీనం (కవి)లో ఉంది. వ్యాపారస్తుడు వాస్తవ దృక్పథం కలిగి ఉంటేనే రాణిస్తాడు. ఊహల్లో తేలి ఆడితే(మీనం) రాణింపు ఉండదు. సుఖం ఉంటుంది. అదే స్వార్ధం ఊహలకు శ్రమించనక్కరలేదు కదా!

## గురునికి కర్కాటకం ఉచ్ఛ - మకరం నీచ

గురుడు మేధావి. తన మాట వినే వ్యక్తి దగ్గర రాణిస్తాడు. రాణి మేధావి మాటను అంగీకరిస్తుంది. రాజు - ఆ మంత్రి చెప్పిన సలహాలను విని తన స్వంత బుద్ధితో ఆలోచన చేసి నిర్ణయాలు తన నిర్ణయాలుగా తీసుకుంటాడు. అందువలన ఈతడు రాణి వద్దనే (కర్కాటకం) రాణిస్తాడు. పట్టుదల గల సేవకుడు (మకరం) ఇతను చెప్పినది చేయవచ్చు. సుఖాన్నియ్యవచ్చు. కాని, ఇతని మేధాశక్తితో పని లేదు. అందుచేత సేవకుని వద్ద మేధావికి రాణింపు ఉండదు.

## శుక్రునకు మీనం ఉచ్ఛ - కన్య నీచ

కళాకారకుడైన శుక్రునికి కవి, వద్ద (మీనం) గౌరవం ఉంటుంది, రాణిస్తాడు. వ్యాపారస్తుని వద్ద (కన్య) ధనం, సుఖం లభించవచ్చు. కాని, రాణించలేడు.

శని సాహసంతో న్యాయాధిపతి వద్ద (తుల) రాణిస్తాడు. సేవక వర్గమంతా పాలకవర్గంపై కోర్టుల ద్వారానే విజయాలు సాధిస్తూంటారు. అందుచేత రాణిస్తారు. సైన్యాధ్యక్షుని వద్ద (మేషం) ఉద్యోగ భద్రత ఉన్నా,

ఈ రాణింపు ఉండదు. పై కారణాల వలన గ్రహాలకు చెప్పిన ఉచ్ఛ నీచలు సహేతుకాలే.

| గ్రహం | ఉచ్ఛ | నీచ |
|---|---|---|
| రవి | మేషం | తుల |
| చంద్రుడు | వృషభం | వృశ్చికం |
| కుజుడు | మకరం | కర్కాటకం |
| బుధుడు | కన్య | మీనం |
| గురుడు | కర్కాటకం | మకరం |
| శుక్రుడు | మీనం | కన్య |
| శని | తుల | మేషం |
| యురేనస్ | వృశ్చికం | వృషభం |
| నెప్ట్యూన్ | కర్కాటకం | మకరం |
| ప్లూటో | | |

యురేనస్ కుజుని న్యాయకర్త లక్షణాలు పుణికి పుచ్చుకున్నందువలన వృశ్చికం అతనికి ఉచ్ఛ అయింది. కార్మిక నాయకులు యాజమాన్యంవారు తీసుకోబోయే నిర్ణయాలను గూఢచారుల ద్వారా ముందుగా పసికట్టి వాటిపై ప్రతి చర్యలను తీసుకోవడం ద్వారా రాణిస్తారు. బాధ్యతగల మంత్రి వద్ద (వృషభం) వీరికి యాజమాన్యం నుండి రక్షణ లభించినా రాణింపు ఉండదు.

నెప్ట్యూన్‌కి ఊహాశక్తి అధికం. ఊహలు రాణి వద్దే (కర్కాటకం) రాణింపు పొందుతాయి. సేవకుని వద్ద (మకరం) రాణించవు.

# గ్రహాలు - గుణదోషాలు

**రవి :-** ఉష్ణశక్తి, విద్యుత్తు, భయం లేకపోవడం, బలం, అందరికీ ఆధారంగా నిలబడడం, కలహ శీలత, ఆశావాధి, శరీరంలో నీటి శాతం తక్కువ, శుష్కగ్రహం, తక్కువ ఫలితం ఇవ్వడం, ప్రభావం అధికంగా ఉండడం.

**చంద్రుడు :-** కఫ ప్రకృతి, శీఘ్రచలనం, మార్పు కోరడం, ప్రయాణ శీలం, కామాతురత, ఆకర్షణ శక్తి, చలి, జలం, ఫలం అధికంగా ఇవ్వడం, ఆలోచనలకు భావనలకు ప్రాధాన్యం ఇవ్వడం, దయకలిగి ఉండడం.

**కుజుడు :-** ఉష్ణ ప్రకృతి, విద్యుత్తు, భయం లేకపోవడం, క్రియా శీలం, కోపం, నీటి శాతం తక్కువ, శుష్కగ్రహం, చంపుట యందు ఇష్టం, హింసా ప్రవృత్తి, సేనతో సంబంధం.

**బుధుడు :-** బుద్ధి ప్రధానుడు, కఫ, వాత, పిత్త, సమప్రకృతి, లేఖన ప్రియత్వం, ఇతరుల ప్రతిభను గ్రహించగలగడం, పరివర్తనాశీలం, త్వరగా ఉత్తేజాన్ని పొందడం, మెదడు, నపుంసకుడు, స్వల్పంగా ఫలితాన్నివ్వడం, శీత గ్రహం.

**గురుడు :-** విస్తరించే లక్షణం, నైతిక నియమ బద్ధుడు కావడం, దాత, పరోపకారి, మంచి శీలం, కొద్దిగా వేడి తత్వం, ఫల దాయక గ్రహం.

**శుక్రుడు :-** సుందరుడు, ప్రేమమయుడు, మంచి శీలం, శాంతి ప్రియుడు, అలంకారం అంటే ఇష్టం, సఫల గ్రహం, కామాతురుడు, కళా ప్రియుడు.

**శని :-** నరములకు సంబంధించిన గ్రహం. చీకటియందు ఇష్టం. వైరాగ్యం. చల్లని గ్రహం, నపుంసకుడు, ఈర్ష్య ఎక్కువ, దీర్ఘాయువు, శ్రమ అధికం, ఫల రహితుడు, అధోముఖుడు, మంద గ్రహం.

**యురేనస్ :-** ప్రభావం ఎక్కువ, శీత గ్రహం, ఫల రహితుడు, త్వరగా ఉత్తేజాన్ని పొందుతాడు, మార్పు యందు ఇష్టం.

**నెప్ట్యూన్ :-** స్నాయుసంబంధ గ్రహం, పరివర్తన శీలుడు, మెదడు, చంచల గ్రహం.

**ప్లూటో :-** స్వార్థ ప్రియుడు, శక్తి శాలి, క్రూరుడు, మార్పును కోరుతాడు.

# గ్రహాలు - శరీరాంగాలు

**రవి :-** ఆత్మ, వీపు, శక్తి, రక్త నాళాలు, సఫేరియల్ అభిప్రాయం ప్రకారం పురుష జాతకంలో కుడి కన్ను సూర్యునికి చెందినది. స్త్రీ జాతకంలో ఎడమ కన్ను సూర్యునికి చెందినది. భారతీయ జ్యోతిషంలో స్త్రీ పురుష భేదం లేకుండా కుడి కంటికి సూర్యుడు ఎడమకంటికి చంద్రుడు అధిపతులు.

**చంద్రుడు :-** వక్ష స్థలం, పొట్ట, జలతత్త్వం, శరీరంలోని కేంద్రాలు (గ్లాండులు) చేసే పనులపై ఆధిపత్యం కలవాడు.

**కుజుడు :-** కండరాలు, తల, ముక్కు, జననేంద్రియం, కిడ్నీలు, ఎముకలలోని మజ్జ.

**బుధుడు :-** మెదడు, నరములు, ఊపిరితిత్తులు, చేతులు, భుజాలు, నాలుక, ముఖం క్రింది భాగం.

**గురుడు :-** పొత్తి కడుపు, పాదాలు, కుడి చెవి, జీర్ణ శక్తి.

**శుక్రుడు :-** కంఠం, ముఖమునందలి కేంద్రాలు (గ్లాండ్స్), వీర్యోత్పాదక భాగం, దవడలు, బాహువులు, ఉత్పాదక శక్తి.

**శని :-** ఎముకలు, భారతీయ జ్యోతిషంలో రవి ఎముకలకు కారకుడు. స్పష్ట భాషణ, ధైర్యం, శీలమండ, ఎడమ చెవి, నాలుక క్రింది భాగం, మల విసర్జన.

**యురేనస్ :-** తేజస్సు, ఓజస్సు శక్తి.

**నెప్ట్యూన్ :-** అసాధారణ దూరం వరకు చూడగలగడం, మానసిక శక్తులు.

**ప్లూటో :-** నాభి నాళము Pineal Gland.

# గ్రహ కారకత్వాలు

**సూర్యుడు :-** రాజు, నవాబు, రాజ్యాధికారి, రాజ్యసభ సభ్యుడు, బంగారు ఆభరణం.

**చంద్రుడు :-** నావికుడు, కాలువ, చెఱువు, నది మొదలైన పనులు చూచేవాడు.

**కుజుడు :-** అగ్నిస్థానం, విద్యుత్తుఉత్పత్తి చేసే స్థానం, రేడియో, వంటిల్లు, బట్టీలు, ఫ్యాక్టరీ, సేన, దొంగతనం, భూమికి సంబంధించిన పనులు.

**బుధుడు :-** క్లర్క్, అకౌంటెంట్, స్కూల్ మాష్టర్, ప్రొఫెసర్, వకీలు, వస్త్ర వ్యాపారి, చిత్రకారుడు, రచనా వ్యాసంగంగలవాడు, రంగులు వేసేవాడు, పబ్లిషర్, సినిమా, సర్కస్ మొదలైన పనులు చేసేవాడు.

**గురుడు :-** ఎడ్వైజర్, న్యాయాధిపతి, పురోహితుడు, ఫాదర్, వకీలు, లోక్‌సభ సభ్యుడు, మతాధిపతి, ప్రొఫెసర్, ఉన్ని వస్త్రాల వ్యాపారి.

**శుక్రుడు :-** సంగీత కారుడు, గాయకుడు, నృత్య కళాకారుడు (భారతీయ జ్యోతిషంలో నృత్యం బుధునికి కూడా చెప్పబడినది), కవి, నాయకుడు, పువ్వులు అమ్మేవాడు, చిత్రకారుడు, కళాకారుడు, భోగ విలాస సామగ్రి తయారు చేసేవాడు, శృంగార సాధనాల నిర్మాత, సిల్కు వస్త్రాల వ్యాపారి, వస్త్రాలపై అలంకరణ చేసేవారు, చక్కని ఆహారం తయారుచేసేవారు, ఆయా (దాది).

**శని :-** భూమి, స్థలాల వ్యాపారి, న్యాయాధిపతి, బొగ్గు వ్యాపారి, రాళ్ళు, సిమెంట్ వ్యాపారి, రాజసేవ, శ్రామికుడు, తైల వ్యాపారి, చర్మ వ్యాపారి.

**యురేనస్ :-** రాజ్యాధికారి, జనంతో సంబంధం కలవాడు, క్రొత్త వస్తువులు ఆవిష్కరించేవాడు, ఇంజనీరు, అసాధారణ కార్యాలు చేసేవాడు,

భూతప్రేత విద్యలు నేర్చినవాడు, మెస్మరిజం ద్వారా చికిత్సలు చేసేవా
జ్యోతిష్కుడు, ముఖ రేఖల ఆధారంగా ఫలితాలు చెప్పేవాడు.

**నెఫ్ట్యూన్ :-** అసాధారణ ప్రతిభ కలవాడు, సూక్ష్మచిత్రకారుడు, ప్రదర్శకుడు, ఉన్నత కళాకారుడు, నీటితో సంబంధంగల పను చేసేవాడు.

**ప్లూటో :-** అణువిజ్ఞాని, అంతరిక్షయాన చోదకుడు, టి. ఇంజనీరు, నీటి క్రింది భాగంలో పని చేయువారు.

లగ్నస్ఫుటంనుంచి సప్తమ స్ఫుటం వరకు ఉన్న గ్రహాలు అదృశా చక్రంలో ఉంటాయి. అందున్న గ్రహాలకంటే దృశ్యార్ధ చక్రంలో దశమా దగ్గరగా ఉన్న గ్రహాలు ఎక్కువ బలం కలిగినవి. ఈ దృశ్యార్ధ చక్రంలో ఉ గ్రహాలను (Elevated Planets) ఎలివేటెడ్ ప్లానెట్స్ అంటారు. అక్కడు గ్రహాలు మంచి, చెడ్డ ఫలితాలను అధికంగా ఇస్తాయి.

# గ్రహములు - రాశులు

**మేషంలో రవి :-** రవికి ఉచ్ఛ మేషం. ఉత్సాహం, ఆరోగ్యం, గౌరవం, పితృ ప్రేమ, తానున్న భావానికి మేలు చేస్తాడు. కాని, ఆ భావానికి చెందిన వ్యక్తులతో కొంత కలహం కూడా ఉంటుంది. శుభగ్రహ దృష్టి ఉంటే కంటి ఆరోగ్యం బావుంటుంది. జీర్ణ శక్తి బావుంటుంది. పొట్ట కొంచెం పెద్దదిగా ఉంటుంది.

**వృషభంలో సూర్యుడు :-** ప్రభుత్వంతో విరోధం, శని దృష్టి పడితే అపకారం, కంటి అనారోగ్యం, తండ్రితో విరోధం, గురుదృష్టి వుంటే స్థిరమైన స్వభావం, మనశ్శక్తి, కార్య సాధన, రాజ గౌరవం, సింహ రాశిపై పాపదృష్టి వుండి రవి, రాహువులు కలిస్తే హృదయ రోగం.

**మిథునంలో రవి :-** ఆలోచన పదునైనది, రచనా నైపుణ్యం, విద్య, వ్యాపారం, సేవక జనాలు, లోతైన విషయాలు వ్రాయగలగడం, పటిష్టమైన, ఆహ్లాదకరమైన వాక్కు, బహుభాషా నైపుణ్యం, సూర్యునికి పాపదృష్టి ఉంటే రాజుతో విరోధం, వ్యాపారంలో హాని, చర్మ రోగం, శ్వాస నాళాలలో అనారోగ్యం, గుండె జబ్బు.

**కర్కాటకంలో రవి :-** మనస్సు చాంచల్యం, పనులలో తొందరపాటు, ప్రయాణాల యందు ఇష్టం, చంద్రుడు బలంగా ఉంటే ధనం, గౌరవం, ఆయువు, సూర్యచంద్రులపై పాపగ్రహాల ప్రభావం ఉంటే ఛాతిలో అనారోగ్యం, స్వల్ప ధనం, సమాయువు, తినుట, త్రాగుట విషయంలలో ఏకాగ్రత లేకపోవడం.

**సింహంలో రవి :-** ఏ భావంలో ఉన్నాడో ఆ భావానికి విశేష ధన లాభము, యశస్సు, శుభగ్రహ ప్రభావం ఉంటే విశాలమైన వక్షస్థలం, మంచి మనస్సు, ఉత్సాహం, అధికార ఔన్నత్యం, పాపగ్రహ ప్రభావం ఉంటే గుండె జబ్బు, వంటిపై దద్దుర్లు.

**కన్యలో రవి :-** కన్యలో రవి ఉండి బుధునిపై శని ప్రభావం ఉంటే షష్ఠాధిపతి శనిచే పీడితుడైతే గుహ్యావయవ అనారోగ్యాలు సంభవిస్తాయి. రవిపై శుభగ్రహ ప్రభావం ఉంటే బుద్ధిమంతుడు, రచయిత, కీర్తి గలవాడు, దీర్ఘజీవి అవుతాడు.

**తులలో సూర్యుడు :-** ఇది నీచ. ఏ భావంలో ఉంటే ఆ భావానికి కొంత నష్టం. సూర్యునిపై పాపగ్రహ ప్రభావం ఉంటే శుక్రుడు కూడా నీచలో ఉంటే ఆ భావానికి సంబంధించిన ఆయువు నశిస్తుంది. కంటికి అనారోగ్యాలు సంభవిస్తాయి. శుభగ్రహ దృష్టి ఉంటే మంచి సంస్కారంకలవాడు, సత్యప్రియుడు, ధార్మికుడు అవుతాడు.

**వృశ్చికంలో రవి :-** కోపం అధికంగా ఉంటుంది. కుజునిపై శుభగ్రహ దృష్టి ఉన్న కోపం తగ్గుతుంది. అండకోశం అనారోగ్యంతో ఉంటుంది. శుభప్రభావం ఉంటే రాజు వలన గౌరవం, ఉత్సాహం, కార్య సాధన.

**ధనుస్సులో రవి :-** ధార్మికుడు, పరోపకారి, సాత్విక ప్రవృత్తి, జ్ఞానం, రాజకృప, తండ్రికి ప్రేమ, చక్కని కన్నులు, పాపగ్రహ ప్రభావం ఉంటే అధికారుల వలన ఇబ్బంది, ప్రభుత్వంతో విరోధం, వక్షస్థలంలో అనారోగ్యం.

**మకరంలో రవి :-** తండ్రితో విరోధం, ప్రభుత్వంతో విరోధం, కనుల బలహీనత, శని బలవంతుడైతే భూసౌఖ్యం, కఠిన వాక్కు సిద్ధిస్తాయి. ఈ దోషాలు సూర్యునిపై శుభగ్రహ దృష్టి వుంటే తగ్గుతాయి.

**కుంభంలో రవి :-** కలహ శీలం, కనుల దౌర్బల్యం, అధికారుల అసంతృప్తి, తండ్రితో విరోధం, ప్రయాణాలలో కష్టాలు ఉంటాయి.

**మీనంలో రవి :-** పాదాలకనారోగ్యం, సూర్యగురులకు పాపగ్రహ ప్రభావం ఉంటే ఆలోచనలో ఇబ్బంది ఉంటుంది. శుభగ్రహ ప్రభావం వల్ల దోషాలు తొలగుతాయి. అధికారుల ప్రేమ, తండ్రి ప్రేమ, అందమైన కళ్ళు, ఆరోగ్యం ఉంటాయి. గురుడు బలవంతుడైతే పుత్రసంతతి ఏ భావంలో

సూర్యుడున్నాడో ఆ భావానికి చెందిన వ్యక్తులతో విరోధం. పాపగ్రహ ప్రభావం పడితే హాని ఎక్కువ జరుగుతుంది.

**మేషంలో చంద్రుడు :-** ఉత్సాహం, కార్యసాధన, రాజ ప్రవృత్తి, పనులు తొందరగా చేయు నేర్పు, పాపగ్రహ ప్రభావం ఉంటే తొందరపాటు వలన ఇబ్బందులు, శుభగ్రహ ప్రభావం ఉంటే ఇతరుల కంటే ఉత్తమంగా శీఘ్రంగా నెరవేర్చి అందరిలో ముందు నిలిచే స్వభావం, బాధ్యతవహించే లక్షణం, కుజుడు కూడా బలంగా ఉంటే సైన్యంలో ఉన్నతాధికారం. ధనం, నలుగురికి ఉద్యోగాలిచ్చే శక్తి, అధికమైన ఆలోచనాశక్తి ఉంటాయి. ఈ శుభ ఫలితాలు చంద్రుని పక్ష బలంపై ఆధారపడి ఉంటాయి. పౌర్ణమికి సమీపంలో ఉన్నకొలది పక్ష బలం బాగుంటుంది.

**వృషభంలో చంద్రుడు :-** ఉచ్చరాశిగాన బలవంతుడు. సూర్యునికి దూరంగా ఉండి శుభ దృష్టి కలిగి ఉంటే దీర్ఘాయువు, ధన లాభం, ఉత్సాహం, రసికత్వం, చక్కని ఆలోచన, ధైర్యం, దయ మొదలైన లక్షణాలు ఉంటాయి. చంద్రుడున్న భావానికి అతడు అధిపతి అయిన భావానికి మేలు చేస్తాడు. అమావాస్యకు దగ్గరగా ఉన్నా పాపగ్రహ ప్రభావం కలిగిఉన్నా, శుభ ఫలాలను ఇవ్వలేడు. తల్లి ఆయువు తక్కువగా ఉండడంగాని మాతృ సౌఖ్యం తక్కువగాని సంభవిస్తుంది. మానసిక చింత వక్ష స్థల సంబంధమైన అనారోగ్యం, ఏ భావంలో ఉన్నాడో ఏ భావాన్ని చూస్తున్నాడో, ఏ భావానికి అధిపతి అయినాడో, ఆ భావాలకు సంబంధించిన ఇబ్బందులు పొందుతాడు.

**మిథునంలో చంద్రుడు :-** కామాతురత, విద్య, వ్యాపారం, వక్తృత్వం, చక్కని రచన, క్రీడాసక్తి మొదలైన ఫలాలనిస్తాడు. పాపగ్రహ ప్రభావం కలిగి ఉంటే భుజాలు, శ్వాస నాళాలు, చర్మం, అనారోగ్య వంతమౌతాయి. ఇలాంటి స్థితిలో బుధుడు, పంచమాధిపతి, బలహీనులైతే పిచ్చివాడయ్యే అవకాశముంది.

**కర్కాటకంలో చంద్రుడు :-** ఉత్తమ పదవి, ప్రయాణ ప్రీతి, తిరిగే స్వభావం, త్వరగా ధైర్యం పొందడం, విశేష ధనం, దీర్ఘాయువు, దయా స్వభావం, పాపగ్రహ ప్రభావం ఉన్నా సూర్యుని సమీపంలో ఉన్నా, పై అంశాలలో ఇబ్బందులు, అధైర్యం, ఆర్థిక నష్టాలు ఉంటాయి.

**సింహంలో చంద్రుడు :-** ఆలోచనా శక్తి, దయ, తన ప్రభావం ఇతరులపై చూపగలగడం మొదలైన లక్షణాలుంటాయి. చంద్రుడు పాపగ్రహ ప్రభావాన్ని పొందినా సూర్యునికి సమీపంలో ఉన్నా అస్థిరచిత్తాన్నిస్తాడు.

**కన్యలో చంద్రుడు :-** స్ఫురణశక్తి అధికంగా ఉంటుంది. పాపగ్రహ ప్రభావం ఉన్నా సూర్యునికి సమీపంలో ఉన్నా భయం, మూర్ఖత్వం, దురలవాట్లు, అనారోగ్యం ఉంటాయి.

**తులలో చంద్రుడు :-** కామాతురత, స్త్రీలపై ఆసక్తి, గానాది కళలపై ప్రీతి, నైపుణ్యం, పాపగ్రహ ప్రభావం సూర్యుని సమీపస్థితివలన చంచలస్వభావం, నిశ్చయాలు లక్ష్యాలు తరచు మారుతూండడం సంభవిస్తుంది.

**వృశ్చికంలో చంద్రుడు :-** నీచ రాశి కావడంవలన ఏ భావంలో ఉన్నాడో ఏ భావానికి అధిపతో ఆ రెండు భావాలకు శ్రమనిస్తాడు. కపటం, కామతురత, కల్గిస్తాడు. శుభగ్రహ ప్రభావం కలిగి ఉంటే ధార్మిక స్వభావాన్నిస్తాడు.

**ధనుస్సులో చంద్రుడు :-** ప్రశాంతమైన ఆలోచన, ధర్మప్రీతి కల్గిస్తాడు. పాపగ్రహ ప్రభావం ఉంటే చంద్రుడున్న భావానికి చెందిన బంధువులకు అల్పాయువునుగాని, వారితో వైరుధ్యాన్నిగాని ఇస్తాడు.

**మకరంలో చంద్రుడు :-** కర్కాటక రాశి ఏ భావమైనదో ఆ భావాన్ని వృద్ధి చేస్తాడు. పాపగ్రహ ప్రభావం కలిగి ఉంటే స్వార్థం నీచ స్వభావం.

**కుంభంలో చంద్రుడు :-** ఉత్సాహం తక్కువ, ఉదాసీన వైఖరి, క్రియాశీలం తక్కువ. శుభగ్రహ ప్రభావం ఉంటే దర్శన శాస్త్రాల యందు ప్రీతి. గంభీర స్వభావం.

**మీనంలో చంద్రుడు :-** భావుకుడు అవుతాడు. పాపగ్రహ ప్రభావం విశేషించి రాహు ప్రభావం ఉంటే మద్యపానం మొదలైన వ్యసనాలకు లోనౌతాడు.

**మేషంలో కుజుడు :-** శుభ గ్రహ ప్రభావం ఉంటే సత్కర్మలు చేయడం, ఉత్సాహం, ఆత్మవిశ్వాసం, పాపగ్రహ ప్రభావం ఉంటే కోపం, మూర్ఖ స్వభావం, స్వార్థం, తక్కువ ఆయువు.

**వృషభంలో కుజుడు :-** దృఢసంకల్పం, కామతురత, ధైర్యం, పాపగ్రహ ప్రభావం ఉంటే కంఠంలో అనారోగ్యం, దయ లేకపోవడం.

**మిథునంలో కుజుడు :-** శుభగ్రహ ప్రభావం ఉంటే సూక్ష్మబుద్ధి, ఇతరులును అర్థం చేసుకునే నేర్పు. అష్టమంలో పాపగ్రహ ప్రభావంతో ఉంటే అల్పాయువు.

**కర్కాటకంలో కుజుడు :-** శుభగ్రహ ప్రభావం కలిగి ఉంటే స్నేహ శీలి, లోకప్రియుడు, క్రూరగ్రహ ప్రభావం ఉంటే అతడున్న భావానికి చెందిన శరీరభాగంలో అగ్ని ప్రమాదం.

**సింహంలో కుజుడు :-** శరీరబలం, శుభగ్రహ ప్రభావం ఉంటే సమానులలో ఉత్తముడు, క్రియశీలుడు, కార్యసాధకుడు, దీర్ఘాయువు కలవాడు, వీరుడు అవుతాడు. పాపగ్రహ ప్రభావం ఉంటే ఉత్సాహం ఉండదు, స్వార్థమెక్కువ.

**కన్యలో కుజుడు :-** శుభగ్రహ ప్రభావం ఉంటే అతడధిపతియైన భావాలకు, వ్యక్తులకు ఔన్నత్యాన్నిస్తాడు. పాపగ్రహ ప్రభావం ఉంటే తానున్న భావానికి అపకారం చేస్తాడు. ఆ శరీరాంగంపై అపరేషన్‌కు అవకాశం ఉంటుంది.

**తులలో కుజుడు :-** శుక్రునిపై తన ప్రభావాన్ని చూపుతుంటే అల్పాయువు. కామాతురత ఉంటుంది. కుజుడు శుభగ్రహ ప్రభావం కలిగి ఉంటే అహింస, బ్రహ్మచర్యం పాటించి, ఆధ్యాత్మిక రంగంలో ఔన్నత్యాన్ని సాధించగలడు.

**వృశ్చికంలో కుజుడు :-** దీర్ఘాయువు, కార్యసాధనా నైపుణ్యం, నాయకత్వం, రక్షణ దళాలతో సంబంధం, పాపగ్రహ ప్రభావం కలిగి ఉంటే నియమ నిబంధనలు లేకపోవడం, స్వేచ్ఛ, కోపం, పట్టుదల, స్వార్థం.

**ధనుస్సులో కుజుడు :-** క్రియా శీలత, క్రియా నైపుణ్యం, న్యాయప్రీతి, కార్యసాధన, పాపగ్రహ ప్రభావం ఉంటే స్వేచ్ఛా ప్రియుడు, అవినీతి, నిర్దయ.

**మకరంలో కుజుడు :-** క్రియా శక్తి, కార్యసాధన, ఉత్సాహం.

**కుంభంలో కుజుడు :-** సోదరులతో విరోధం, అనవసరమైన కోపం, పట్టుదల, ప్రేమ నటించడం, శని ప్రభావం కుజునిపై ఉంటే నాలుక క్రింద పుండు, శుభగ్రహ ప్రభావం ఉంటే నిమ్నజాతుల మేలుకోరే స్వభావం.

**మీనంలో కుజుడు :-** పరోపకారి, పరమార్థసాధన, భావుకత్వం, పాపగ్రహ ప్రభావం వలన మద్యపానాసక్తి.

**మేషంలో బుధుడు :-** ఊహాశక్తి అధికం, నిశ్చయ శక్తి అధికం. పాపగ్రహ ప్రభావం ఉంటే వ్యంగ్యంగా మాట్లాడే స్వభావం, ఊపిరితిత్తులు, శ్వాసనాళాలు అనారోగ్యం పొందుతాయి.

**వృషభంలో బుధుడు :-** కావ్యరచనాశక్తి, ఆశు కవితా నైపుణ్యం, అందంగా మాట్లాడే నేర్పు, పాపగ్రహ ప్రభావం ఉంటే కామాతురత.

**మిథునంలో బుధుడు :-** చక్కని సంభాషణాశక్తి, బుద్ధికుశలత, రచనాశక్తి, చిత్రలేఖనం, వ్యాపారకుశలత, పాపగ్రహ ప్రభావం ఉంటే చర్మ, చెవి, శ్వాస కోసం అనారోగ్యాలను పొందే అవకాశం ఉంది.

**కర్కాటకంలో బుధుడు :-** ప్రజాసేవ, దయ, పాపగ్రహ ప్రభావం ఉంటే స్వార్థం, నిర్దయ.

**సింహంలో బుధుడు :-** ఇతరులపై అధికారం చెలాయించటం, పాపగ్రహ ప్రభావం ఉంటే మంద బుద్ధి, తనకు అధికారం లేని చోటగూడా చెలాయించడం.

**కన్యలో బుధుడు :-** శరీరలావణ్యం, బుద్ధికుశలత, విషయ పరిజ్ఞానం. పాపగ్రహ ప్రభావం ఉండి షష్ఠిభావం, షష్ఠాదిపతి, వీరిపైగూడ పాప ప్రభావం ఉంటే హెర్నియా వంటి అనారోగ్యాలు.

**తులలో బుధుడు :-** ఇతరులతో కలిసే స్వభావం, చక్కని సంస్కారం, పాపగ్రహ ప్రభావం ఉంటే కామాతురత, అస్థిరమైన ఆలోచనలు, మానసికమైన చిక్కులు ఏర్పడుతాయి.

**వృశ్చికంలో బుధుడు :-** శుభ గ్రహ ప్రభావం ఉంటే పనులు చక్కగా వేగంగా చేసే నేర్పు, అధికమైన ఆలోచనాశక్తి. పాపప్రభావం ఉంటే విద్యాహీనత, వ్యసనపరత్వం, చర్మ వ్యాధులు, శ్వాస కోశ వ్యాధులు.

**ధనుస్సులో బుధుడు :-** శుభగ్రహ ప్రభావం వలన విద్యావంతుడు ధార్మికుడు, బుద్ధిమంతుడు. పాపగ్రహ ప్రభావం ఉంటే ధర్మవిరోధి, ఆడంబరం గలవాడు.

**మకరంలో బుధుడు :-** శుభగ్రహ ప్రభావం ఉంటే గంభీరుడు, విద్యావంతుడు, అందరికి ఇష్టుడు. పాపగ్రహ ప్రభావం విశేషించి శని, రాహువుల ప్రభావం ఉంటే, హెర్నియా వంటి అనారోగ్యావకాశాలుంటాయి.

**కుంభంలో బుధుడు :-** సామాన్య జనులకుపకారాలు చేసి అందరి ఆదరాన్ని పొందడం, నిమ్నవర్గాలవారి హితవును ఆలోచించడం, గాంభీర్యం, పాప ప్రభావం ఉంటే ఆలోచనలో లోపం, తక్కువగా చదువుకోవడం, ఊపిరితిత్తుల అనారోగ్యం.

**మీనంలో బుధుడు :–** శుభగ్రహం ప్రభావం ఉంటే బుద్ధికుశలత, భావుకత, విద్య, ధర్మం, ఇతరుల కష్టాలను చూచి ఆదుకునే సానుభూతి. పాపగ్రహ ప్రభావం ఉంటే నిశ్చయాత్మక శక్తి లోపించడం.

**మేషంలో గురుడు :–** శుభ గ్రహప్రభావం ఉంటే సుఖం, ఆరోగ్యం, ధనం, కార్యసాధన, సత్సంతానం, అధికారుల ఆదరణ, సాటివారిలో ఔన్నత్యం, పాపప్రభావం ఉంటే అసత్యజ్ఞానాన్ని ప్రచారం చేయడం, కడుపులో అనారోగ్యం.

**వృషభంలో గురుడు :–** భౌతికజ్ఞానం, పరోపకారం, సామాజిక సేవా కార్యక్రమాలు, పాపప్రభావం ఉంటే లోభి, చెడ్డ కళల యందిష్టం. పాదములకు సంబంధించిన అనారోగ్యం.

**మిథునంలో గురుడు :–** శుభగ్రహ ప్రభావం వలన ప్రతిభ, విద్యాసక్తి, సూక్ష్మబుద్ధి. పాపగ్రహ ప్రభావంవలన మితభాషి, ధనహాని, కడుపులో అనారోగ్యం.

**కర్కాటకంలో గురుడు :–** శుభగ్రహ ప్రభావంవలన పాండిత్యం, సద్గుణాలు, జ్ఞానం, సుఖం, ధార్మికత, అధికారుల ఆదరణ, దాతృత్వం. పాపగ్రహ ప్రభావం ఉంటే స్వార్థప్రియుడు.

**సింహంలో గురుడు :–** శుభగ్రహ ప్రభావం ఉంటే ధనం, ధార్మికత, దానం, ఉన్నతుడు, సుఖం. పాప ప్రభావం ఉంటే ఆడంబరం, కడుపులో అనారోగ్యం.

**కన్యలో గురుడు :–** శుభగ్రహ ప్రభావం ఉంటే దానప్రియుడు, దయాళువు, తీవ్రబుద్ధి కలవాడు, చిన్న చిన్న విషయాలను కూడా బాగా ఆలోచించి అర్థం చేసుకొని పనిచేయువాడు. పాప ప్రభావం విశేషించి శని, రాహువుల ప్రభావం ఉంటే వంకరగా మాట్లాడడం, తక్కువ విద్యావంతుడుగానుండడం.

**తులలో గురుడు :-** దూరాలోచన, సూక్ష్మ పరిశీలన, ఉత్సాహం, పాపగ్రహ ప్రభావంవలన సమాజానికి అపకారం చేసే స్వభావం, చెడ్డ కళలపై ప్రీతి, వివేకం లోపించడం.

**వృశ్చికంలో గురుడు :-** శుభగ్రహ ప్రభావం వలన ఆధ్యాత్మిక జ్ఞానం, ధనం, సానుభూతి. పాపగ్రహ దృష్టి వలన స్వార్థం, నిర్దయ వ్యసనం.

**ధనుస్సులో గురుడు :-** సుఖం, వివేకం, ధనం. పాప ప్రభావం ఉంటే తక్కువ ధనం, నిర్దయ, స్వార్థం.

**మకరంలో గురుడు :-** ఉత్సాహం, స్వల్పధనం, స్వార్థం, పాపప్రభావం ఉంటే డబ్బులేమి, దుఃఖం, అధికారులవలన ఇబ్బంది, స్వల్పసంతతి.

**కుంభంలో గురుడు :-** గంభీర ప్రవృత్తి, సమాజసేవ, పాపగ్రహ ప్రభావం ఉంటే అధికారులతో విరోధం, దుఃఖం, స్వల్పధనం, స్వార్థం.

**మీనంలో గురుడు :-** దాత, అధికదాతృత్వంతో ఇబ్బందులు, ధార్మికుడు, ధనం, అధికారుల ఆదరణ, సుఖం. పాపప్రభావంవలన అవసరం లేని ఊహలు, ధనహాని, పాదాలకు అనారోగ్యం.

**మేషంలో శుక్రుడు :-** ఉత్సాహం, కార్యకుశలత, నాయకత్వం, సంస్కారం, పాపగ్రహ ప్రభావం ఉంటే గుప్తరోగాలు, అనారోగ్య స్త్రీ సంబంధం, వ్యసనాలు, స్వార్థం.

**వృషభంలో శుక్రుడు :-** వక్త, గాయకుడు, మంచి సంస్కారం, అందరి మేలుకోరుట, పాపగ్రహ ప్రభావం ఉంటే కంఠానికి అనారోగ్యం, రుచులకు లోబడి ఎక్కువ తినుట, దయ లేకుండుట.

**మిథునంలో శుక్రుడు :-** కళాకుశలత, భాషణ నైపుణ్యం, ప్రేమ వ్యవహారాలు, చక్కని విద్య, వివేకం. పాపగ్రహ ప్రభావం ఉంటే కామ పరితాపం, బహు స్త్రీ సంబంధం.

**కర్కాటకంలో శుక్రుడు :-** అస్థిరప్రవృత్తి, సమాజ సేవ, అందరినీ నమ్మటం, పాపగ్రహ ప్రభావం ఉంటే స్వార్థం, అందరితో విరోధం.

**సింహంలో శుక్రుడు :-** ప్రతిభ, ఆత్మాభిమానం, ఉత్సాహం. పాపగ్రహ ప్రభావం ఉంటే స్త్రీ సౌఖ్యం తక్కువ, స్వార్థం, తన సుఖం తాను చూసుకోవటం.

**కన్యలో శుక్రుడు :-** కావ్యరచన, శరీరలావణ్యం, ప్రేమ, కొన్ని విషయములలో కపటం, పాపగ్రహ ప్రభావం ఉంటే నీచ కర్మలు, మోసము.

**తులలో శుక్రుడు :-** సత్యప్రియత్వం, శౌర్యం, పరోపకారం, సామాజిక సేవా కార్యక్రమాలు, పాపగ్రహ ప్రభావం ఉంటే కామాసక్తి, అనారోగ్య స్త్రీ సంబంధం, కళా కుశలత.

**వృశ్చికంలో శుక్రుడు :-** గాంభీర్యం, కామాతురత, పాపగ్రహ ప్రభావం ఉంటే పట్టుదల, స్వార్థం, గుప్తరోగాలు.

**ధనుస్సులో శుక్రుడు :-** కార్య కుశలత, న్యాయ శాస్త్ర పరిజ్ఞానం, సానుభూతి, స్వార్థం, పాపగ్రహ ప్రభావం ఉంటే స్త్రీ సౌఖ్యం తక్కువ.

**మకరంలో శుక్రుడు :-** ఉత్సాహంగా ఉన్నా దానిని ఇతరులకు చూపడం ఇష్టం ఉండదు. పాపగ్రహ సంబంధమున్న విశేషించి శని, రాహువుల ప్రభావం ఉంటే స్త్రీ వియోగం.

**కుంభంలో శుక్రుడు :-** పరోపకారం, నిమ్నజాతుల వారిని ప్రేమించటం, ధైర్యం, స్త్రీ సుఖం, పాపగ్రహ సంబంధం ఉంటే వ్యభిచారం, భార్యావియోగం.

**మీనంలో శుక్రుడు :-** మంచి సంస్కారం, ఉత్సాహం, దృఢ సంకల్పం, పాపగ్రహ ప్రభావం ఉంటే స్వార్థం.

**మేషంలో శని :-** క్రియా కుశలత, కోపం, విఘ్నాలను ఇష్టపడే బద్ధకం, శుభగ్రహ ప్రభావం ఉంటే ధైర్యం, భూస్వామి, గ్రామంలో ప్రముఖత్వం, గాంభీర్యం, ధనం.

**వృషభంలో శని :-** శుభగ్రహప్రభావం ఉంటే దృఢ సంకల్పం, కార్య కుశలత, భూస్వామి, కృషిశీలత, పాపగ్రహ ప్రభావం ఉంటే బద్ధకం, కంఠరోగం, స్వార్థం.

**మిథునంలో శని :-** కార్య నైపుణ్యం, భూస్వామి, దీర్ఘాయువు, పాపగ్రహ ప్రభావం ఉంటే విద్యాహీనత, ద్యూతప్రియత్వం, మందబుద్ధి.

**కర్కాటకంలో శని :-** జన ప్రియత్వం, ఇంటి పనిలో నైపుణ్యం, భూస్వామి, దీర్ఘాయువు, పాపగ్రహ ప్రభావం ఉంటే ఉదాసీనత, వైరాగ్యం, బద్ధకం, ఛాతిలో నొప్పి.

**సింహంలో శని :-** ప్రతిష్ఠ, భూస్వామి, ప్రతాపం, సామాజిక సేవ, పాపగ్రహ ప్రభావం ఉంటే అల్పాయువు, దుఃఖం, కపటం, మోకాళ్ళకు అనారోగ్యం.

**కన్యలో శని :-** ధైర్యం, చిన్న చిన్న మాటలు కూడా గుర్తుపెట్టుకోవడం, చక్కగా మాట్లాడటం, కృషిశీలత, పాపగ్రహ సంబంధం ఉంటే అల్పవిద్య, నరాలు, మోకాళ్ళకు సంబంధించిన అనారోగ్యం, ఊపిరితిత్తులకు సంబంధించిన అనారోగ్యం.

**తులలో శని :-** వడ్డీ డబ్బు, ఆయువు, పొలం, కృషిశీలత, పరోపకారం, పాపగ్రహ ప్రభావం ఉంటే స్త్రీ వల్ల దుఃఖం, గుప్తరోగాలు.

**వృశ్చికంలో శని :-** కృషిశీలత, స్వార్థం, పాపగ్రహ ప్రభావం విశేషించి కుజ ప్రభావం ఉంటే అండకోశ రోగం, శుభగ్రహ ప్రభావం ఉంటే అభివృద్ధి, భూస్వామి, దీర్ఘాయువు.

**ధనుస్సులో శని :-** ఆదర్శ ప్రియుడు, ధార్మికుడు, గాంభీర్యం, వృత్తిలో అభివృద్ధి, భూస్వామి, దీర్ఘాయువు, పాపగ్రహ సంబంధం ఉంటే ఆలస్యం, స్వార్థం.

**మకరంలో శని :-** భూస్వామి, నెమ్మదిగా పనులు చేయడం, రాజస ప్రకృతి, గొప్పతనమందు కాంక్ష, పట్టుదల, పాపగ్రహ సంబంధం ఉంటే మోకాళ్ళకు సంబంధించిన అనారోగ్యం.

**కుంభంలో శని :-** పరోపకారం, జన సామాన్యమందు ప్రీతి, ప్రజా సేవ, దీర్ఘ జీవిత్వం, భూస్వామి, కృషిశీలుడు, పాపగ్రహ ప్రభావం ఉంటే నీచ ప్రకృతి, జన ద్వేషం, పిక్కలకు అనారోగ్యం.

**మీనంలో శని :-** వివేకం, స్థిరమైన మనస్సు, పరోపకారం, పాపగ్రహ సంబంధం ఉంటే కృషిశీలత కాకపోవటం, ఆలస్యం, స్వార్థం, పాదాలకు అనారోగ్యం.

**యురేనస్ :-** యురేనస్ సూర్యుని వంటివాడు. కాని, అకస్మికంగా జరిగే విషయాలపై ఇతని ప్రభావం ఎక్కువ. విద్రోహం, భూకంపం, పిడుగు పాటు ప్రమాదాలు మొదలగు వాటిపై ఇతని ప్రభావం ఉంటుంది. శుభగ్రహ ప్రభావం ఉంటే అధికారం, నాయకత్వం మొదలైన లక్షణాలుంటాయి. చలిత చంద్రుడు, జన్మకాలిక యురేనస్‌తో కలిస్తే అధికారం సిద్ధిస్తుంది. ఇతనిపై చెడ్డ గ్రహాల ప్రభావం ఉంటే అధికార భంగం.

**మేషంలో యురేనస్ :-** క్రియాశీలత, ప్రతాపం, వివేకం, పాపగ్రహ ప్రభావం ఉంటే మానసిక అనారోగ్యం, తన మాటపై అనవసరపు పట్టుదల ఉంటుంది.

**వృషభంలో యురేనస్ :-** త్వరగా ఆవేశం, కళలంటే ఇష్టం, పాపగ్రహ ప్రభావం ఉంటే జనానికి దూరంగా ఉండటం, కళలంలే ఇష్టం, స్వార్థప్రియత్వం.

**మిథునంలో యురేనస్ :-** ఆలోచన, తీవ్ర కృషి, వివేకం, పాపగ్రహ ప్రభావం ఉంటే సోదరులతో విరోధం.

**కర్కాటకంలో యురేనస్ :-** గృహ సౌఖ్యం, మానసిక శాంతి, పాపగ్రహ ప్రభావం ఉంటే పట్టుదల, ఏ ప్రశ్నకైనా తగిన సమాధానం చెప్పకపోవటం.

**సింహంలో యురేనస్ :-** ప్రతాపం, స్వాభిమానం, అధికారం, శరీర శక్తి, సూక్ష్మ విషయ పరిజ్ఞానం, పాపగ్రహ ప్రభావం ఉంటే అలంకారం, పట్టుదల, అధికారంతో శతృత్వం.

**కన్యలో యురేనస్ :-** సూక్ష్మబుద్ధి, కార్యకుశలత, పాపగ్రహ ప్రభావం ఉంటే స్వార్థం ఎక్కువ.

**తులలో యురేనస్ :-** కామాతురుడు, తులనాత్మక అధ్యయనం, పాపగ్రహ ప్రభావం ఉంటే ప్రేమ సంబంధ విషయాలలో నష్టాలు.

**వృశ్చికంలో యురేనస్ :-** కామప్రవృత్తి, కోపం, శుభ గ్రహ ప్రభావం ఉంటే కృషిశీలత.

**ధనస్సులో యురేనస్ :-** ధార్మిక ప్రవృత్తి, ధర్మోపదేశం, ధర్మ ప్రచారం, పాపగ్రహ ప్రభావం ఉంటే ఆగ్రహం ఉన్న చోట అనారోగ్యం, దెబ్బలు.

**మకరంలో యురేనస్ :-** వ్యాపార కుశలుడు, జనమునకు హితం చేసేవాడు. పాపగ్రహ ప్రభావం ఉంటే జనంతోను, అధికారులతోను విరోధం.

**కుంభంలో యురేనస్ :-** గంభీర బుద్ధి, తత్వ విచారణ, విజ్ఞానం, నిమ్న వర్గాలపై సానుభూతి, శరీరకష్టం - గొప్పదనే భావన.

**మీనంలో యురేనస్ :-** తేజస్వి, అధికారుల ఆదరణ, పాపగ్రహ ప్రభావం ఉంటే ఆవేశం, పాదాలకు అనారోగ్యం, శారీరకంగా స్వాతంత్ర్యం లేకపోవటం.

**మేషంలో నెప్ట్యూన్ :-** శుభగ్రహ ప్రభావం అనుకున్నది సాధించ గలగడం. పాపగ్రహ ప్రభావం - ఆలస్యం, పరనింద.

**వృషభంలో నెప్ట్యూన్ :-** శుభగ్రహ ప్రభావం సుందరుడు, సంగీతాది కళలలో నేర్పుకలవాడు. ఆహార పానీయాలయందిష్టం. పాపగ్రహ ప్రభావం ఉంటే కంటికి అనారోగ్యం.

**మిథునంలో నెప్ట్యూన్ :-** శుభగ్రహ ప్రభావం ఉంటే చక్కని సంభాషణ. పాప ప్రభావం ఉంటే శిరస్సుకు శ్వాసనాళాలకు, అనారోగ్యం.

**కర్కాటకంలో నెప్ట్యూన్ :-** శుభగ్రహ ప్రభావం - ఆధ్యాత్మికంగా ఎదుగుదల, శక్తులు సిద్ధులు, ప్రేతాత్మలతో సంభాషించే నేర్పు. సుఖం, జనులకిష్టుడు. పాప ప్రభావం ఉంటే అనారోగ్య భావనల వలన అనారోగ్యం.

**సింహంలో నెప్ట్యూన్ :-** స్వస్థ శరీరం, ప్రతిభ, ప్రతాపం, అభినయమందిష్టం. పాప గ్రహ ప్రభావం ఉంటే అనారోగ్యాలు.

**కన్యలో నెప్ట్యూన్ :-** జనప్రియుడు, బుద్ధిమంతుడు. పాప ప్రభావం ఉంటే యితరుల దోషాలు గుర్తించడం, ఇతరులను నిందిచడం వల్ల మిత్రులు తగ్గిపోతారు.

**తులలో నెప్ట్యూన్ :-** సుందర వస్తువులపై అభిరుచి, న్యాయ ప్రియుడు. పాప ప్రభావం ఉంటే మూత్రరోగం.

**వృశ్చికంలో నెప్ట్యూన్ :-** జీవాత్మ రహస్యాలు, భవిష్యత్తు తెలుస్తాయి. పాప ప్రభావం ఉంటే కామవాసనలు, వ్యసనాలు.

**ధనస్సులో నెప్ట్యూన్ :-** పరోపకారి, ధార్మికుడు. పాప ప్రభావం ఉంటే ధర్మమందు అయిష్టం, దుఃఖం, ప్రభుత్వ వ్యతిరేక చర్యలు.

**మకరంలో నెప్ట్యూన్ :-** శుభగ్రహ ప్రభావం ఉంటే కృషిశీలుడు నిమ్న జాతులపై ప్రేమ. పాపప్రభావం ఉంటే స్వార్థం, నీచమైన ఆలోచనలు, ఈర్ష్య.

**కుంభంలో నెప్ట్యూన్ :-** జలం, సంగీతం అన్న యిష్టం. సానుభూతి పరోపకారం. పాప ప్రభావం ఉంటే పిక్కలు, శీలమండలు అనారోగ్యం.

**మీనంలో నెప్ట్యూన్ :-** పరోపకారం, ధర్మం. పాప ప్రభావం ఉంటే వ్యసనాలు, అవమానం.

**మేషంలో ప్లూటో :-** ఉత్సాహం, సేన, రక్షణ శాఖ, దీనిలో ఆధునిక విజ్ఞానాన్ని ఉపయోగించడం, పాప గ్రహ ప్రభావం ఉంటే మెదడుకు సంబంధించిన అనారోగ్యం.

**వృషభంలో ప్లూటో :-** గానం, నృత్యం, తానలంకరించుకోవడం, యితరులను అలంకరించడం. పాప ప్రభావం ఉంటే కురూపి.

**మిథునంలో ప్లూటో :-** ఆధ్యాత్మిక విచారణ, హేతువాదమందు అయిష్టం, పాప గ్రహ ప్రభావం ఉంటే సిద్ధులు సాధించి ఇతరులకపకారం చేసే లక్షణం.

**కర్కాటకంలో ప్లూటో :-** మానసిక ప్రశాంతి, పాప గ్రహ ప్రభావం ఉంటే దృష్టి లోపం. గృహ జీవనంలో కలతలు, ఛాతి అనారోగ్యం.

**సింహంలో ప్లూటో :-** ప్రతాపం, ప్రభావం, అధికారం, ఔదార్యం, పాప గ్రహ ప్రభావం ఉంటే దర్పం, లోభం.

**కన్యలో ప్లూటో :-** చక్కని వివేచనాశక్తి. పాప గ్రహ ప్రభావం ఉంటే స్వార్ధం, నిర్దయ, క్రౌర్యం.

**తులలో ప్లూటో :-** ప్రేమ, అందరికీ మేలుకోరడం, సానుభూతి, క్రియాశీలం. పాప ప్రభావం ఉంటే అందరితో విరోధం.

**వృశ్చికంలో ప్లూటో :-** శరీరం పుష్టివంతంగా ఉంటుంది. మల్ల యుద్ధం, బాక్సింగ్ మొదలైన వానిపై ఆశక్తి. పాప ప్రభావం ఉంటే కామసక్తి అధికం.

**ధనస్సులో ప్లూటో :-** ఆధ్యాత్మిక స్ఫూర్తి, ధార్మిక ప్రవృత్తి. పాప ప్రభావం ఉంటే పెద్దలకు కష్టం కల్గించుట, ప్రభుత్వానికి వ్యతిరేకంగా, ప్రవర్తించడం.

**మకరంలో ప్లూటో :-** దీర్ఘాయువు, కార్యసాధన, ప్రజాసేవ. పాప గ్రహ ప్రభావం ఉంటే చిక్కిన శరీరం, బలంలేని కాళ్ళు, స్వార్థం, లోభం.

**కుంభంలో ప్లూటో :-** పరోపకారం, ఇతరుల మేలుకోరడం, చక్కని మిత్రుడు. పాప గ్రహ ప్రభావం ఉంటే జనద్వేషం, కృశించిన శరీరం, పిక్కలయందు అనారోగ్యం.

**మీనంలో ప్లూటో :-** సుఖం, మానసికానందం. పాప గ్రహ ప్రభావం ఉంటే మద్యపానం, కారాగారం, పాదాలయందు అనారోగ్యం.

# ప్రాచ్య - పాశ్చాత్య జ్యోతిషాలలో సారూప్యాలు - భేదాలు

రాశి స్వరూపాలు, భావ స్వరూపాలు, గ్రహ స్వభావాలు రెండిట ఏకీభవిస్తాయి. సంస్కృతిలో తేడా ఉన్నందువల్ల కారకత్వాలలో స్వల్ప భేదాలుంటాయి. లగ్నం, సూర్య లగ్నం, చంద్ర లగ్నం ఈ మూడింటికి ప్రాధాన్యం ఇవ్వడం రెండిటా ఉంది. కాని గోచారంలో భారతీయులు చంద్ర లగ్నానికి పాశ్చాత్యులు సూర్య లగ్నానికి ప్రాధాన్యతం ఇస్తారు. విశేషించి యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో యొక్క ప్రభావాలలోను వృత్తులు, విద్యలు, కారకత్వాలలోనూ పాశ్చాత్య జ్యోతిషం ఆధునిక పరిశీలనలను కలిగి ఉంది. సూర్య రాశులలో జన్మించిన వారి స్వరూప వర్ణన పాశ్చాత్య జ్యోతిషం అధికంగా చేస్తుంది. సాయన నిరయనాలు మౌలిక భేదాలలో భారతీయ జ్యోతిషం నిరయన పద్ధతిని పాశ్చాత్య జ్యోతిషం సాయన పద్ధతిని స్వీకరిస్తుంది. వసంత సంపాతం (Vernal Equinox) మేష రాశి ప్రారంభంగా సాయన పద్ధతిని గుర్తిస్తున్నాయి. ఇది సుమారు సంవత్సరానికి 51 సెకన్లు కదులుతూ ఉంటుంది. భారతీయ పద్ధతిలో నిరయన మేషం అశ్విని నక్షత్రంతో ఆరంభమౌతుంది. ఇది మార్పులేనిది.

# దశలు - దృష్టులు

మరో ముఖ్య భేదం దశాపద్ధతి. భారతీయ జ్యోతిషంలో జన్మ నక్షత్రాన్ని అనసరించి ఆరంభమైన దశ, తర్వాత దశలు క్రమంగా వస్తూంటాయి. పాశ్చాత్య పద్ధతిలో గ్రహాల దృష్టుల ఆధారంగా ఫలితాలు చెప్తారు. జన్మ కాలమందలి దశమ స్ఫుటం, లగ్నస్ఫుటం, గ్రహాలు ఆధారంగా చేసుకొని సంవత్సరానికి ఒక డిగ్రీ చప్పున కదుపుతూ అప్పటి గ్రహాలకు, జనన కాల గ్రహాలకు మధ్య ఏర్పడే దృష్టుల ఆధారంగా ఫలితాలు చెపుతూంటారు.

40వ సంవత్సరము ఫలితాలు కావాలంటే జనన కాల గ్రహస్థితికి ప్రతి గ్రహాన్ని 40 డిగ్రీలు ముందుకు జరిపి ఆ చక్రంలోని గ్రహాలకు జనన కాల గ్రహాలకు ఏర్పడిన దృష్టుల ఆధారంగా ఫలితాలు చెప్పడం జరుగుతుంది.

# గ్రహ - దృష్టులు

మరో ముఖ్య భేదం గ్రహ దృష్టులు భారతీయ పద్ధతిలో అన్ని గ్రహాలు సప్తమాన్ని చూస్తాయి. విశేషించి గురుడు ఐదు, తొమ్మిది రాశులను కుజుడు నాలుగు ఎనిమిది రాశులను, శని 3,10 రాశులను చూస్తారు. పాశ్చాత్య పద్ధతిలో అన్ని గ్రహాలు అన్ని రాశులను చూస్తాయి కాని ఆ దృష్టులు కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి ఉంటాయి.

| దృష్టులు | చిహ్నములు | అంతరం (డిగ్రీలు) | ఫలితం |
|---|---|---|---|
| కోణ పాద దృష్టి (Semi sextile) | ⊻ | $30^0$ | కొంచెం మంచిది |
| అర్ధకేంద్ర దృష్టి (Semi square) | ∠ | $45^0$ | చెడ్డది |
| కోణార్ధ దృష్టి (Sextile) | ⚹ | $60^0$ | మంచిది |
| కోణాంశక దృష్టి (Quintile) | Q | $72^0$ | కొంత మంచిది |
| కేంద్ర దృష్టి (Square) | □ | $90^0$ | చెడ్డది |
| త్రికోణ దృష్టి (Trine) | △ | $120^0$ | మంచిది |
| పూర్ణార్ధకేంద్ర దృష్టి (Sesqui - Quadrate) | ⚼ | $135^0$ | చెడ్డది |
| ద్వికోణాంశక దృష్టి (Biquintile) | | $144^0$ | కొంత మంచిది |
| విరోధ దృష్టి (Opposition) | ☍ | $180^0$ | చెడ్డది |
| సమాంతర స్థితి (Parallel) | | -- | సామాన్యం (గ్రహాల - స్వభావాలను అనుసరించి నిర్ణయించాలి) |
| యుతి (Conjunction) | ☌ | 0 | సామాన్యం (గ్రహాల స్వభావాలను అనుసరించి నిర్ణయించాలి) |

**భారతీయ పద్ధతిని అనుసరించి :-** క్రూరగ్రహం యొక్క దృష్టి మంచిది కాదు. సౌమ్యగ్రహాల దృష్టి మంచిది. క్రూరగ్రహం ఆధిపత్యాన్ని బట్టి, స్థితిని బట్టి మేలు చేసినా అతని దృష్టి మంచిది కాదు. సౌమ్య గ్రహం ఆధిపత్యాన్ని బట్టి స్థితినిబట్టి మంచిది కాకున్నా అతని దృష్టి మంచిదే.

పాశ్చాత్య పద్ధతి ప్రకారం గ్రహం ఎవరైనా మంచి దృష్టి మంచిది, చెడ్డ దృష్టి మంచిది కాదు.

**కారకత్వాలు :-** సామాన్యంగా భావ కారకత్వాలు రెండు పద్ధతుల్లోనూ ఏకీభవిస్తాయి. కొన్ని కొన్ని భేదాలున్నాయి. చతుర్థం తల్లి అని భారతీయ పద్ధతి పాశ్యాత్య పద్ధతిలో కొందరు చతుర్థాన్ని తండ్రికి స్థానం అన్నారు. సఫేరియరియల్ చతుర్థంలో తల్లిదండ్రులనిద్దరిని అంగీకరించారు. ఎలెన్ లియో చతుర్థం తల్లి స్థానం అన్నారు. కొందరు భారతీయ జ్యోతిష్కులు చతుర్థంలో తల్లి, తండ్రి కారకత్వాలు చెప్పారు. దశమం తండ్రి అని పాశ్చాత్య జ్యోతిషం అభిప్రాయపడితే నవమం పితృ స్థానమని భారతీయ జ్యోతిష్కులు అభిప్రాయబడ్డారు. కొందరు భారతీయ జ్యోతిష్కులు దశమంలో కూడా తండ్రిని గుర్తించారు. నవమాత్తు అష్టమం చతుర్థం కాబట్టి తండ్రి జీవనం మరణం చతుర్థంతో సంబంధం కలవి అవుతున్నాయి.

నవమం తండ్రి నుండి వచ్చే ఆధ్యాత్మిక ( భారతీయులు ఆధ్యాత్మిక ప్రియులు) వారసత్వం, దశమం లౌకిక వారసత్వం అన్ని గ్రహించవచ్చు. చతుర్థం సుఖం, దశమం అధికారం కాబట్టి తల్లిదండ్రులలో ఆత్మీయతను పంచే వ్యక్తి చతుర్థంలోనూ క్రమశిక్షణలో పెట్టే వ్యక్తి దశమంలోనూ ఉంటారనడం సహేతుకం అవుతుంది.

తృతీయంలో బాహుబలం, ఉత్సాహం, జన సహకారం అనేవి భారతీయులు గుర్తించగా బుద్ధిబలం అనే అంశాన్ని గమనించాలని పాశ్చాత్యులు అభిప్రాయపడ్డారు. చతుర్థంలో వక్షస్థలం చూడాలి అని

భారతీయులు ఉదరం చూడాలని (ఎలెన్ లియో) పాశ్చాత్యులు. సప్తమం గుప్తేంద్రియాలు - అష్టమం అండకోశం అని భారతీయులు, అష్టమం గుప్తేంద్రియాలని పాశ్చాత్యులు, నవమంలో దూర ప్రయాణాలు అని భారతీయులు విదేశీయానాలని పాశ్చాత్యులు. స్వక్షేత్రానికి సప్తమం (Fall) బలహీనమని పాశ్చాత్యులు. నీచ ఎక్కువ బలహీనమని భారతీయులు. పతికారకుడు సూర్యుడు, పత్నీకారకుడు చంద్రుడు అని పాశ్చాత్యులు, పతికారకుడు గురుడు, పత్నికారకుడు శుక్రుడు అని భారతీయులు అభిప్రాయపడ్తున్నారు. లగ్నస్ఫుటం లగ్నారంభమని పాశ్చాత్యులు, లగ్నస్ఫుటం లగ్నమధ్యమం అని భారతీయులు అభిప్రాయపడ్తున్నారు.

1. పరివర్తన (ఒకరి రాశిలో మరొకరు ఉండడం)
2. దృష్టి (ఒకరి నొకరు చూడడం)
3. ఒకరి రాశిలో ఒకరుండి ఆ రాశ్యాధిపతిచే చూడబడటం.
   ఉదా :- మీనంలో ఉన్న కుజుని గురుడు చూడడం
4. యుతి అనే సంబంధాలు భారతీయులు అంగీకరించారు. వానిలో పరివర్తన అన్నిటికంటే బలమైనదిగా గుర్తించారు. పాశ్చాత్యులు యుతి మాత్రమే బలమైనదని అన్నారు.

భారతీయులు గ్రహాలకు మూలత్రికోణ రాశులను గుర్తించారు. పాశ్చాత్యులు ఈ విషయం స్పృశించలేదు. పాశ్చాత్యులు primary, secondary directions - progressed horoscope. అనే విధానాలను ఫలకాల నిర్ణయానికి ఉపయోగిస్తున్నారు. భారతీయులు గ్రహ దశలను వాడుతున్నారు. ఇలాంటి భేదాలను సమన్వయాత్మక దృష్టితో జాతకాలను పరిశీలిస్తే ఉత్తమ ఫలాలను సాధించవచ్చు.

# ఆకాశవాణి ప్రసంగాలు

## 1. జ్యోతిర్దర్శనం

వినీలాకాశంలో ఎన్నో చుక్కలున్నాయి. ఆ చుక్కలు మెరుస్తూ కంటిని ఆకర్షిస్తూ ఉంటాయి. ఆ చుక్కల్లో కొన్ని నక్షత్రాలు మరి కొన్ని గ్రహాలు, ఒక అణువులో కేంద్రం చుట్టూ పరిభ్రమించే కణాలు దీర్ఘవృత్తాకార కక్ష్యతో పరిభ్రమిస్తూ ఉంటాయి. సౌరకుటుంబంలో కూడా అదేరీతిలో గ్రహాలు పరిభ్రమిస్తూ ఉంటాయి. ఆకాశంలో ఇలాంటి సౌరకుటుంబాలు ఎన్నో ఉన్నాయి. ఆ సౌరకుటుంబాలన్నీ ఓ కేంద్రం చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటాయి.

అనంతుడు అనిపిలవబడే విష్ణువును సంబంధించిన సహస్ర నామాలు విశ్వం విష్ణుర్వషట్కారః. విశ్వం ఒక నామం. ఆ భగవంతునికి ఒక ఆకారం లేదు. రంగులేని ఆకాశం, నీలిరంగులో కనిపిస్తూ ఉంటుంది. అలాగే రంగు రూపంలేని ఆకాశం నీలంగా కనిపిస్తున్నట్లే రూపంలేని విష్ణువు నీలిరంగుగా వర్ణించుటలో ఒక గూఢార్థం దాగి ఉంది. ఆ నీలిరంగుకు అధిపతి శని. ఆ శనికి అధిష్టానం విష్ణువు. ఈ అనంతవిశ్వంలో ఉండే కాంతి పుంజాలేవైతే ఉన్నాయో ఆ కాంతి పుంజాలన్నిటి యొక్క స్వరూపాన్ని వాటి ప్రభావాన్ని గురించి వివరించేది జ్యోతిషం.

ప్రకృతిలో ఒక సారూప్యం ఉంది. ఒక అణువులో ఏముందో బ్రహ్మండంలోను అదే ఉంది. బ్రహ్మండాన్ని మనం అర్థం చేసుకోవాలంటే అణువులో దర్శించాలి అంటారు యోగులు. యోగులు తమ శరీరంలో ఉండే ఏవిశ్వమైతే ఉందో దాన్ని దర్శిస్తూ విశ్వంలో జరిగిన, జరుగుతున్న, జరుగబోవు అంశాలన్నిటిని గుర్తించారు అంటారు సాంప్రదాయ వాదులు. ఈ గ్రహాలు కాంతితో, ఆకర్షణ శక్తితో భూమిని భూమిలో ఉండే పదార్థాన్ని వ్యక్తులను మనస్సులను ప్రభావితం చేస్తాయనటం జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయం. సూర్యుని కాంతిలో ఏడురంగులున్నాయి. ఏడు గ్రహాలుకు

ఏడు రంగులున్నాయి. సంగీతంలోను సప్త స్వరాలున్నాయి. శరీరంలో ఏడు ధాతువులున్నాయి. మనస్తత్వశాస్త్ర ప్రకారం విశ్వంలోని వ్యక్తులందరిలోను ఏడురకాల వర్గీకరణాలున్నాయి. అంటే ఏడు రకాల మనస్తత్వాలు ఉన్నాయి. పంచ భూతములున్నవి. ఆత్మ, మనస్సు, అనేవి ఉన్నాయి. ఆ మొత్తం కలిపితే ఏడే అవుతున్నాయి. ఏడు గ్రహాల యొక్క ప్రభావాన్ని ఈ వ్యక్తులు కలిగి ఉంటారు అనేది జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయమన్న మాట.

ఒకే కాంతికి ఒక రంగుకు మనసుపై ప్రభావం ఉంది అని ఆధునిక పరిశోధకులు వక్కాణించారు. ఆ పరిశోధనల్లో తేలిన సారాంశం ఏమంటే ఒక రంగు కలిగిన కాంతి వ్యక్తి మనస్సులో ఒక రకమైన భావాన్ని ప్రేరేపిస్తుంది. ఇలా ఉన్న ఏడురంగులు ఏడురకాల భావాల్ని ప్రేరేపిస్తూ ఉంటే ఆ ఏడు, ఏడు గ్రహాల స్వభావాలకు వేరైనవి కాకుండా ఉన్నాయి. ఈ విశేషాన్ని మనం గమనించాలి. సూర్యుని యొక్క కాంతి వృక్షజాలాన్ని పెంపొందిస్తోంది. ఆ వృక్షాలు ఆహారాన్ని అందిస్తున్నాయి. ఆ ఆహారాన్ని వ్యక్తులు స్వీకరిస్తున్నారు. దానివల్ల వారి మనస్సు ప్రభావితమవుతోంది. శరీరం తయారవుతోంది. అందువల్ల ఏడురంగులు కలిగినటువంటి ఏడు గ్రహాల కాంతుల సూక్ష్మతరమైన ప్రభావం వ్యక్తి మనసుపై ఉంటుంది. వాస్తవానికి జ్యోతిషంలో సహేతుకత పరిపూర్ణంగా ఉంది. ఒక మనసు, ఒక ఆలోచన ప్రతిక్రియపై ప్రభావాన్ని చూపిస్తాయి. ఆ మనసుపై గ్రహాలు ప్రభావం చూపిస్తూ ఉన్నప్పుడు క్రియలన్నింటిపైన గ్రహ ప్రభావం పరోక్షంగా ఉంది అని అంగీకరించక తప్పదు. అయితే ఇక్కడ మనం గుర్తించాల్సిన విషయం ఒకటి ఉంది. వ్యక్తి తాను చేసే పనులన్నింటికి తాను బాధ్యత వదలివేసుకొని గ్రహాలయొక్క ప్రభావంవల్లనే ఇవన్నీ జరుగుతున్నాయనడం మాత్రం సరైనది కాదు. ఎందుకంటే భావ ప్రేరణ వరకూ గ్రహాలవల్ల జరిగితే క్రియాప్రేరణ అనేది వ్యక్తి స్వాతంత్ర్యాన్ని బట్టి ఉంటుంది. పదివంతులలో నాలుగువంతులు గ్రహ ప్రభావం మిగిలిన ఆరు వంతులు స్వయంకృషి. వ్యక్తి తన మనసులో కలిగిన భావాలన్నింటిని

ఆచరణలో పెట్టలేడు. తన మనస్సులో కలిసిన భావాలన్నిటికి గ్రహాలు కారణం కావచ్చు. వాటిలో నుండి మంచివాటిని ఏరుకోవాల్సిన వివేకం మానవునికి ఉండాలి. ఆ బాధ్యత మనిషికి ఉంది. ఆ బాధ్యత ప్రకారం నడిచినప్పుడు వ్యక్తి తన ప్రవర్తనను సక్రమం చేసుకోగల్గుతాడు. సత్ఫలితాలను ఆశించగలుగుతాడు. ఏయే మనోభావాలు స్వీకరించాలి ఏయే మనోభావాలు ప్రమాదకరమైనవి. వేటిని ఆచరించాలి వేటిని ఆచరించకూడదు మొదలైన అంశాలను జ్యోతిశ్శాస్త్రం వివరిస్తోంది.

లోకంలో మంచి చెడ్డలు అంతటా ఉంటాయి. ఈ మంచి చెడ్డలు కొన్ని సందర్భాలలో సాపేక్షమే అవుతూ ఉంటాయి. ఒక కుజుడ్ని తీసుకుందాం. అతడు సైన్యాధ్యక్షుడు. అంటే యుద్ధం చేస్తాడు, అందర్నీ చంపుతాడు. మంచి వాడే. అదే ఒక హంతకుడున్నాడు. అతడు కూడా కుజ ప్రభావానికి లోబడిన వాడే. ఆ కుజ ప్రభావం వల్ల చంపడం అనే ప్రక్రియ ఒక్కటే. అయినా మానసిక లక్ష్యాన్ని బట్టి మంచి చెడులు నిర్ణయవుతున్నాయి. అతనిని అభిమానించే వ్యక్తులకు అతడు మంచివాడు కావచ్చు కాని అందరికి కాడు. అందువల్ల మన వివేకం అనేటువంటిది సర్వ సామాన్య ప్రజానీకాన్ని దృష్టిలో పెట్టుకొని వారందరి మనోభావాలను ఆధారం చేసుకొని ఒక నీతిని, సామాజిక న్యాయాన్ని ఆధారం చేసుకొని మంచి చెడ్డలను నిర్ణయం చేసుకోవాలి. అలా చేసుకోవాలి అన్న సందర్భంలో ఉన్నదేమిటో తెలుసుకోకుండా సరిచేసుకోవడం ఎలా కుదురుతుంది. ఆ ఉన్నది తెల్సుకోవడానికి జ్యోతిషం ఉపకరిస్తుంది.

ఒక శరీరంలో అనారోగ్యం పుట్టింది అంటే మనసునించి పుట్టింది అని అర్థం. మనసుతో ప్రారంభమైన ఈ అనారోగ్యమే శరీరానికి వ్యాపిస్తుంది. అలాంటి సందర్భంలో కూడా ఏ గ్రహం వల్ల మనస్సులో దోష భావన కలిగింది. ఆ దోష భావనని తొలగించుకోవటం ఎలా అనే ప్రయత్నం కూడా మనం చేయాలి. విశేషించి మనస్సుకి ఒక వేదన, ఒక ఆందోళన కలిగినపుడు అది షుగరుకు కారణం అవుతుంది. కొన్ని

సందర్భాలలో రోగ నిరోధక శక్తి బాగా పనిచేసే సందర్భంలో ఒక చర్మ వ్యాధికి కారణం అవుతుంది. అదే ఆందోళన. నేను తక్కువ వాడను అనే భావన క్షయ వ్యాధికి కారణం అవుతుంది. వీటినన్నిటిని బట్టి మనం అర్థం చేసుకోవల్సింది ఏమిటంటే ప్రశాంతమైన మనసు కలిగిన వ్యక్తి ఆరోగ్యాన్ని పొందుతాడు. మనస్సులో భావన ఒక ఆశ, నిరాశ, దురాశ ఏదైనా సరే పెరిగింది అంటే అది రేపు అనారోగ్యాన్ని కల్గిస్తుందని అర్థం. అలా మనస్సు యొక్క వేగాలను క్రమ బద్ధం చేసుకోవాలి అంటే గ్రహ సంబంధమైన పరిజ్ఞానం ఉండాలి.

పదార్థాలు భావనలు గ్రహాలకు సంబంధించినవే అయినపుడు అనువైన పదార్థాలను వ్యక్తి స్వీకరించటం ద్వారా తన ఆరోగ్యాన్ని, మనస్సును, ఆలోచనను సక్రమం చేసుకోగలుగుతాడు. ఇలా ఒక వ్యక్తి సక్రమమైన ఆలోచన చేసాడు అంటే అది అతని జీవితానికే కాదు తన చుట్టూ వుండే సమాజానికి తన దేశానికి ప్రపంచానికి మేలు చేసినవాడవుతాడు. అలాగే ఒక విద్యార్థి ఉన్నాడు అతని మానసిక శక్తులను అతని జాతకం ద్వారా తెలుసుకొనవచ్చు. అతని మానసిక శక్తి ఏ విద్యలో రాణిస్తుందో తెలుసుకోవడం ద్వారా ఆ విద్యలోనే అతడు కృషి చేసినట్లైతే దేశానికి మేలు చేసినవాడవుతాడు. తన సమయం వ్యర్థం చేసుకోనివాడవుతాడు. ఆసక్తి లేని విద్య సీటు దొరికింది కదా అని చదివితే అది లోకానికి ఉపకారమా! తనకుపకారమా! అందుచేత ఈ వ్యక్తి ఎందుకూ పనికిరాడు. అతన్ని ఏ రంగంలో మనం సక్రమంగా వినియోగించవచ్చునో ఏ రంగంలో అతడు రాణించినందువల్ల అతనికి లోకానికి కూడా ఉపకారమే జరుగుతుందో అనే విషయాలు జ్యోతిశ్శాస్త్రం నిర్ధారణ చేస్తుంది.

అతి ప్రాచీన కాలంలో ఆధిమ మానవుడు మొదట దర్శించింది సూర్యాది గ్రహాలనే. సూర్యుని యొక్క ఉదయాస్తమయాలు ఆధారంగానే తన యొక్క నిత్య జీవితాన్ని వికసింప చేసుకుంటూ వచ్చాడు. నాగరికత

వికసించింది. ఆలోచన వికసించింది. అట్టి స్థితిలో ఆలోచన యొక్క ప్రాథమిక స్థితికి మనం వెళ్ళినట్లైతే జ్యోతిషం ద్వారానే ఆలోచన వికసించిందని మనం అర్థం చేసుకోవచ్చును. విశేషించి తాను తీసుకొనే ఆహారం తాను ధరించే బట్టలు, తాను వాడే కాంతి, తనయొక్క ప్రవర్తన వీటినన్నిటిని కూడా క్రమబద్ధంగా చేసుకోడానికి జ్యోతిషం అనువైన అంశాలను వ్యక్తీకరిస్తూంటుంది. తన యొక్క భవిష్యత్తులో ఏ కోణంలో కృషి చేసినట్లైతే అభివృద్ధిని సాధించగల్గుతామో అది తను రాణించటానికి ఉపకరిస్తుంది అనేటువంటి విషయాలను దర్శించే ఒక దర్శనం జ్యోతిర్దర్శనం.

# 2. ప్రాచ్యపాశ్చాత్య గోచారాలు

ప్రతి మానవుడు ఆనందం కోసం భవిష్యత్తును సుఖప్రదంగా మలచుకోవడం కోసం ప్రయత్నిస్తూ ఉంటాడు. ఆ ప్రయత్నంలో తన చుట్టూ వుండే సమాజానికి అనుకూలంగా తాను సంచరిస్తూ ఆ సమాజాన్ని తనకు అనుకూలంగా మలచుకుంటూ సహజీవనం కోసం సుఖజీవనం కోసం ప్రయత్నిస్తూంటాడు. సమాజంలో పలువర్గాలు వారు ఉంటారు. తనకంటే క్రింది స్థాయి వారు ఉన్నత వర్గానికి చెందినవారు ఆ రెండు వర్గాలవారిని తనకు అనుకూలంగా మలచుకుంటాడు. వారికి అనుకూలంగా ప్రవర్తిస్తాడు. అలాంటి సాంఘిక జీవనమే సంఘ శ్రేయస్సుకు ఉపకరిస్తుంది. అదే విధంగా జీవనాన్ని గడచిన జీవనం, గడుస్తున్న జీవనం, రాబోయే జీవనం అని మూడు రకాలుగా అర్థం చేసుకోవచ్చు. ఆ మూడింటిని సమన్వయం చేసుకొనే విధానమే జ్యోతిషం.

కాలం మూడు రకాలు. అవి భూత, భవిష్యద్వర్తమానాలు. మానవుడు గడిచిన కాలంలోని అనుభవాలు ఆధారంగా వర్తమాన కాలంలో సంచరిస్తాడు. భవిష్యత్తులో చేయబోయే పనులకు మార్గాలను నిర్దేశించుకుంటూ ఉంటాడు. మనస్తత్వ శాస్త్ర వేత్తల పరిశోధనల ప్రకారం సృష్ట్యాది నుంచి సకల జీవుల అనుభవాలు అంతశ్చేతనలో నిక్షిప్తమై ఉంటాయి. యోగ శాస్త్రం ప్రకారం భూత, భవిష్యత్, వర్తమాన కాలాల్లోని సంఘటనలన్నీ అంతశ్చేతనలో నిక్షిప్తమై ఉంటాయి. వ్యక్తి సాధన ద్వారా భవిష్యత్తులోకి పయనించే అవకాశముంది. ప్రతి వ్యక్తి యొక్క మనసుకు ప్రత్యేకమైన శక్తి ఉంటుంది. అదే సత్యస్ఫురణ. ఆ శక్తి ద్వారా వాస్తవాలను గమనించవచ్చు. ఆ సత్యం గుర్తించే శక్తికి దేశ కాలాలు, ప్రత్యక్ష పరోక్షాలు ఆటంకాలు కావు. ఉదయం ఏడుగంటలకు పొరుగూరిలోని మిత్రుడు గుర్తుకు రావడం అదే సమయానికి మిత్రుడు ఊళ్లో దిగడం లాంటి అనుభవాలు ప్రతి వ్యక్తికి నిత్య జీవితంలో జరుగుతూ ఉంటాయి.

ఇవి కాకతాళీయాలు కావు. మనసుకున్న ఈ శక్తి వేరువేరు రూపాల్లో దర్శనమిస్తూ ఉంటుంది. దాన్ని పెంచుకోవడానికి సాధన కావాలి. ఆ సాధనలో భాగంగానే కొన్ని ఆధారాలను ఏర్పరచుకున్నాడు.

భవిష్యత్తును తెలుసుకోవడానికి చేసే ప్రయత్నంలోనే సాముద్రికం, జాతకం, గోచారం, శకునములు, శరీర భాగాలు అదరటం మొదలైన మార్గాలు ఏర్పరచుకున్నాడు. ఆధారాలను ఏర్పరచుకోవడంలో వ్యక్తి మానసిక శక్తి, స్థితి, ముఖ్య పాత్ర వహిస్తాయి. ఒక వస్తువుని చూసినపుడు ఆ వస్తువు యొక్క స్వరూపాన్ని గుర్తించడానికి ఒక ఇంద్రియం ద్వారా మాత్రమే కాకుండా రెండు, మూడు ఇంద్రియాల ద్వారా తెలుసుకోవడానికి ప్రయత్నం చేస్తూ ఉంటాడు. నిప్పును గుర్తించటానికి కంటితో కాంతిని చూడటం, చేత్తో ముట్టుకుని చూడటం మొదలైన ప్రయత్నాల ద్వారా నిర్ధారణకు వస్తూంటాడు. అలాగే భవిష్యత్తును తెలుసుకోవడానికి జాతకం, గోచారం, సాముద్రికం మొదలైన విధానాలను సమన్వయం చేసుకోవాలి.

గోచారంలో తేదీని బట్టి రాశిని నిర్ణయించే పద్ధతి ఒకటి, జన్మ నక్షత్రం బట్టి నిర్ణయించే పద్ధతి వేరొకటి ఉన్నాయి కదా! ఏది వాస్తవం? అనే సందేహం తలయెత్త వచ్చును.

దేశ భేదాలను బట్టి ఆలోచనా భేదాలను బట్టి విధానాలలో కూడా భేదాలుంటూ ఉంటాయి. అందువల్ల జాతకం చూచే పద్ధతుల్లోనూ, గోచారం చూచే పద్ధతుల్లోనూ భేదాలు వచ్చాయి. పాశ్చాత్యులు సూర్యుని స్థితిని బట్టి గోచారం చూస్తారు. అది జనన తేదీపై ఆధారపడింది. భారతీయుల్లో చాలా మంది చంద్ర రాశిని బట్టి గోచారం చూస్తారు. ఇది నక్షత్రంపై ఆధారపడింది. శాస్త్రాలలో చంద్రరాశి, లగ్నరాశి, సూర్యరాశి అనే మూడింటిని బట్టి గోచారం చూసే విధానాలు వివరించబడ్డాయి. కాబట్టి ఒకటి సత్యమని, మరొకటి అసత్యమని అనకూడదు. సత్యాన్ని గుర్తించే మానసిక శక్తి యొక్క స్థాయిని బట్టి వాస్తవాలు గుర్తించబడుతూంటాయి. శాస్త్రం ఒక్కటే కదా! ఒకే రాశి వారికి లేదా ఒకే

నక్షత్రం వారికి ఫలితాల్లో తేడాలెందుకు? అనే ప్రశ్న మరొకటి. ఆలోచించే వ్యక్తి యొక్క ఆలోచనా ధోరణులు అనుభవాలు కూడా ఫలనిర్దేశంలో ప్రముఖ పాత్ర వహిస్తాయి. అందువల్ల ఒక వ్యక్తికి చెప్పే ఫలితాలకు మరో వ్యక్తికి చెప్పే ఫలితాలకు కోణాలు వేరవుతూంటాయి.

జాతకంగాని, గోచారంగాని వాస్తవాలను సూచించే ప్రయత్నమే చేస్తుందిగాని నియమించదు. వ్యక్తి పూర్వజన్మలో చేసిన కర్మకు ఎంతటి శక్తి వుందో ఈ జన్మలో చేసే ప్రయత్నానికి కూడా అంతటి శక్తి ఉంది. తన ప్రయత్నం ఏ కోణంలో చేస్తే ఫలితాన్ని ఆనందప్రదంగా మలచుకోవచ్చునని జ్యోతిశ్శాస్త్రం నిర్దేశిస్తుంది. వ్యక్తిని కృషి శీలురుగా మార్చడంలో జ్యోతిషం ప్రధాన పాత్ర వహిస్తుంది. తన జాతకంలోగాని గోచారంలో గాని మంచికి అవకాశం ఉన్నప్పుడు దానికి తగిన కృషి చేయడం, చెడ్డకి అవకాశం ఉన్నప్పుడు దాన్ని తొలగించుకొనేటందుకు ప్రయత్నం చేయడం జ్యోతిశ్శాస్త్రం యొక్క పరమ ప్రయోజనం. వ్యక్తి తన జీవితాన్ని మలచుకొనేటందుకు ఆలోచనలను క్రమబద్ధం చేసుకొనేటందుకు గల అవకాశం చంద్ర గోచారం సూచిస్తుంటే జీవితంలో జరగబోయే సంఘటనలను సౌర గోచారం సూచిస్తుంది. ఆ రెండింటిని సమన్వయం చేసుకుంటూ వ్యక్తి యొక్క శారీరక స్థితిని, శరీర తత్వాన్ని ఆరోగ్య అనారోగ్యాలను లగ్న గోచారం వ్యక్తీకరిస్తుంది.

పుట్టిన లగ్నాన్ని బట్టి చంద్రుడున్న రాశిని బట్టి, సూర్యుడున్న రాశిని బట్టి గోచారం చూసే పద్ధతుల్ని శాస్త్రం విధిస్తోంది. జన్మ నక్షత్రం తెలియని వారికి పేరుని బట్టి చూసే పద్ధతి కూడా వాడుకలోకి వచ్చింది. దీనిలో మంత్ర శాస్త్రానికి సంబంధించిన రహస్యం కూడా నిక్షిప్తమై ఉంది. ఒక అక్షరానికి ఒక ప్రత్యేకమైన శక్తి ఉంది. దాని ఆధారంగానే నామ నక్షత్రాలు పేరుకు సంబంధించిన సంఖ్యా శాస్త్రం ఆధారపడి ఉన్నాయి. వ్యక్తి శరీరానికి, మనసుకి పేరుతో అనుబంధం ఏర్పడుతుంది. ఆ అనుబంధం స్థిరం కావడానికి కాల పరిమితి కూడా ముఖ్యమే. ఏడు గ్రహాల్లో శని మిగిలిన

గ్రహాలన్నిటికంటే ఎక్కువ కాలం సంచరిస్తాడు. అతడు రాశి చక్రాన్ని పూర్తిగా తిరిగి రావడానికి 30 సంవత్సరాలు పడుతుంది. అందువల్ల ఒక పేరుతో 30 సంవత్సరాలు వ్యవహరించబడితే ఆ పేరుకి శరీరానికి మనసుకు అనుబంధం స్థిరమౌతుంది. అందువల్ల 30 సంవత్సరాలు నిండిన వారికి మాత్రమే నామ రాశి ఫలితాన్నిస్తుందని శాస్త్రం చెపుతోంది.

వ్యక్తి జన్మించినపుడు ఉన్న గ్రహస్థితుల ఆధారంగా ఏర్పడేది జాతకం. జాతకంలోని గ్రహాలు ఆ వ్యక్తి యొక్క ప్రత్యేకమైన ఆసక్తులు, నైపుణ్యాలు, స్వభావం, శారీరక స్థితి అనే వాటిని నిర్దేశిస్తూంటాయి. ఆ గ్రహాల స్థితిననుసరించి ఏర్పడే భావాలలో కొన్నిటిని ఆచరణలో పెట్టడానికి వ్యక్తి ప్రయత్నిస్తూంటాడు. అందులో బలమైన భావనలకు కృషి తోడవుతుంది. సాంఘిక న్యాయం, ధర్మం, పరిసరాలు, అవకాశాలు మొదలైన వాటిని ఆధారంగా చేసుకొని వ్యక్తి కృషిని పెంపొందించుకుంటూంటాడు. ఇలాటి నియమాలను పాటిస్తూ నిర్ణయాలు తీసుకొనే వ్యక్తిని సంఘం మంచివాడంటుంది.

తనకు తోచిన రీతిలో స్వేచ్ఛగా సంచరించే వ్యక్తిని సమాజం వేరుగా భావిస్తుంది. గ్రహాలు భావ ప్రేరకాలైనా ఆ భావాలలో మంచి భావనలనే ఆచరణలో పెట్టాలి. అలాంటి వివేకం గలవాడు స్వతంత్రుడు. తంత్రం అంటే ఆలోచన.

పుట్టిన సమయంలోని జాతకంలో వున్న గ్రహాలు ఆధారంగా ప్రస్తుతం ఆకాశంలో సంచరించే గ్రహాలు ఫలితాలను, భావాలను ప్రేరేపిస్తాయి. ప్రస్తుతం సంచరించే గ్రహాలు సూచించే ఫలితాలను చూసే పద్ధతినే గోచారం అని వ్యవహరించడం జరుగుతోంది. ఈ గోచారంలోని గ్రహాలు జాతకంలో వున్న భావాలనే ప్రేరేపిస్తున్నాయి. జాతకంలో లేని భావాలను ప్రస్తుత గోచారం ప్రేరేపించదు. అందువలననే ఒక రాశి గల వారందరిలో సమానంగా గోచార గ్రహాలు భావ ప్రేరణను కలిగించవు. ఈ విషయాన్ని స్పష్టంగా గుర్తించి గోచారంలో వుండే మంచి భావాలకు అనుగుణంగా కృషిని

పెంచుకోవాలి. గోచార దోషాలకు భయపడి కృషీశీలతను కోల్పోకుండా, ఆ దోషాలను అధిగమించి కార్యాన్ని సాధించడానికి అధికంగా కృషి చేయాలి. ఆ కృషి రెండు రూపాల్లో ఉంటుందని శాస్త్రం చెపుతుంది. మన మనస్సును మనం స్వాధీనం చేసుకొని వివేకం పెంపొందించుకొనుటకు ఉపకరించేది ఆధ్యాత్మిక కృషి. నిశ్చయింపబడిన మంచి పనికి కార్యరూపం కలగడానికి చేసే భౌతిక ప్రయత్నం లౌకిక కృషి ఆధ్యాత్మిక, లౌకిక కృషులు ఏకీభవించినపుడు కలిగే కార్యసిద్ధి ఆనందాన్నిస్తుంది. ఆ ఆనంద సాధనకు గోచారం సహకరిస్తుంది.

# 3. గ్రహాలు - పదార్థాలు

గ్రహకాంతుల ప్రభావం మనుష్యులపై ఉండడం గమనిస్తున్నాం. జాతకాలు గోచారాలు మొదలైన వాటి ద్వారా తమ భవిష్యత్తును తెల్సుకొనే ప్రయత్నం మనుష్యులు చేస్తున్నారు. ఈ గ్రహాల ప్రభావం పశుపక్ష్యాదులపైన నిర్జీవ పదార్థాలపైన ఉంటుందా? అనేది ఒక ప్రశ్న. పశువులకి పక్షులకి చైతన్యంతో పాటు కదలికలు కూడా ఉంటాయి. కోపతాపాలు ఉన్నాయి. కాబట్టి వాటిపై కూడా ఈ ప్రభావాలు ఉంటాయనడం సమంజసమే. వాటికి సుఖదుఃఖాలు యజమానుల ప్రేమానురాగాలు గొడ్డొచ్చిన వేళ మొదలైన అదృష్టాలు ఉన్నట్లు అనుభవం తెలుపుతోంది.

రెండవ వర్గం చైతన్య తన్యమున్నా కదలికలు లేని వృక్షాలు వాటిపై కూడా గ్రహాల ప్రభావం ఉందనక తప్పదు. సూర్యకాంతిలో ఉన్న ఏడు రంగులు ఏడు గ్రహాలకు ప్రతీకలు. ఆ కాంతి కిరణ జన్య సంయోగ క్రియ ద్వారా వృక్ష జాతులలో హరితకణాల ఉత్పత్తికి ఎదుగుదలకు కారణమౌతోంది. విశేషించి ఆయా వృక్ష జాతుల్లో కొన్ని కొన్ని ప్రత్యేక లక్షణాలుంటాయి. గ్రహాల ప్రభావం ఆయా ప్రత్యేక లక్షణాలను అందిస్తోందనవచ్చు లేదా గ్రహ ప్రభావాల్లోని ప్రత్యేక లక్షణాల ద్వారా వృక్ష జాతుల వర్గీకరణ సామాన్య లక్షణాల పోలిక ఆ గ్రహ ప్రభావాలను గుర్తించటానికి కారణమౌతున్నాయి. విశేషించి కాంతి వృక్షంగా, వృక్షం ఆహారంగా ఆహారం శరీరంగా మనసుగా రూపొందుతున్నందువలన గ్రహ ప్రభావాలు వ్యక్తులలో త్వరత్వరగా మార్పులను కలిగిస్తున్నాయి. ఈ కోణంలో ఆలోచించునపుడు గ్రహ కాంతులకు వృక్ష జాతులు వాహకాలు అనక తప్పదు.

గ్రహాల దుష్టకిరణాల ద్వారా వ్యక్తిలో ఏర్పడే శారీరక, మానసిక రుగ్మతలకు గ్రహాల మంచి కిరణాల ద్వారా వృద్ధి చెందిన వృక్ష జాతులు

ఔషధాలౌతాయి అనేది జ్యోతిర్వైద్య సిద్ధాంతం. వ్యక్తి తగిన ఆహారాన్ని తీసుకోవాలి అని భగవద్గీత వచనం. ఆయుర్వేద సిద్ధాంతం జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయం ఉపనిషోద్ఘోష. ఈ తగిన అనే పదం చాలా విలువ కలిగి ఉంది. వేదాంత పరంగా మితమైన సాత్వికాహారం ఆయుర్వేద పరంగా వ్యక్తి శరీరానికి తగిన పౌష్టికాహారం అనే అర్థాలు చెప్పినా జ్యోతిర్వైద్య పరంగా వ్యక్తి దశకు గ్రహమిచ్చిన లోపాన్ని పూరించే ఆహారమని చెప్పాల్సివుంది. ఈ కోణంలో ఆలోచన చేసినపుడు జ్యోతిర్వైద్యం ఆయుర్వేదం కంటే భిన్నమై సమగ్రమై తన ప్రత్యేకతను నిలుపుకుంటోంది.

''ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్'' అనే సంప్రదాయం ప్రసిద్ధమైనది. వాస్తు శాస్త్ర విద్య ఈశాన్యాన ఉన్న నుయ్యి తూర్పున ఉన్న స్నానగృహం, యింటిలో ఈశాన్యన ఉన్న పూజాగృహం, ఆగ్నేయాన ఉన్న వంటిల్లు బాలభానుని లేత కిరణాల వల్ల ఆరోగ్యాన్ని పెంచుతాయి. సౌరస్నానాల పేరిట ఆరోగ్యం సాధిస్తున్నారు. ఉదయకాంతి శరీర ఆరోగ్యనికి చాలమంచిదని క్రొత్త వైద్య ప్రక్రియ కూడా రూపొందుతున్నది. ఉదయాన సంధ్యావందనం, సూర్య నమస్కారాలు ఉదయకాలపు నడక ఆరోగ్యవంతుల మంచి అలవాట్లు. సూర్యుని కాంతిని ప్రత్యేక అద్దంద్వారా అనారోగ్య ప్రదేశంలో ప్రసరింపజేసి అనారోగ్యాన్ని నివారించే పద్ధతిని రష్యన్ శాస్త వేత్తలు నిరూపించిరి. వేరువేరు రోగాలకు వేర్వేరు రంగుటద్దాలద్వారా సూర్యకాంతిని ప్రసరింపజేసి అనారోగ్యాలను నివారింపజేసే కలర్ థెరపీ ప్రసిద్ధి చెందుతోంది. రవికి సంబందించిన ధాన్యం గోధుమలు, గోధుమపాలు, గోధుమ గడ్డి రసం పలువిధాలైన అనారోగ్యాలను నివారిస్తున్నట్లుగా శాస్త్రవేత్తలు వక్కాణిచారు. ఎముకలకు అధిపతి రవి. ఆ ఎముకలలోని లోపాలను పగడం ద్వారా పూరించడం ఫ్రాన్స్ శాస్త్రజ్ఞుల కృషి ఫలితం. జ్యోతిశ్శాస్త్ర రీత్యా పగడం రవికి చెందిన అల్పమూల్య రత్నం. ఇలా రవి లక్షణాల గల పదార్థాలు రవి ప్రభావంవలన జనించిన రోగాలన్నీ నయం చేస్తున్నాయి. శరీరంలోని కాల్షియమునకు

ముత్యపు చిప్పలకు, ముత్యాలకు, మంచి గంధానికి లవణానికి చంద్రుడధిపతి. మనస్సుకు చంద్రుడధిదేవత. రక్తంలోని తెల్ల రక్త కణాలకు చంద్రుడే అధిపతి. శరీరంలో కాల్షియం లోపించినపుడు ముత్యపు భస్మం మందుగా తీసుకోవాలంటోంది ఆయుర్వేదం. పూర్వపు రాజులు ముత్యపు సున్నం తాంబూలంలో వాడుకున్నారు. శరీరంలోని రక్త వేగం పెంచడానికి లవణం ఉపయోగపడుతుంది. ప్రేమ, కోపం, ఉద్వేగానికి బొమ్మ బొరుసు. ఆ ఉద్వేగాన్ని పెంచే లక్షణం లవణంలో ఉంది. ఆ ప్రేమకు కూడా చంద్రుడే అధిపతి. అదే లవణాన్ని సూక్ష్మీకరించి (నేట్రం మ్యూర్) మందుగా వాడితే ఉద్వేగాన్ని రక్త పోటుని తగ్గిస్తోంది. మంచి గంధం రాసుకుంటే చల్లదనం ఇస్తుంది. వెన్నెల ఆ లక్షణం కలదే. ముత్యం ధరిస్తే మనసు ప్రశాంతిని పొందుతుందని జ్యోతిశ్శాస్త్ర సాంప్రదాయం. ఎర్ర రక్త కణాలకు, రక్త చందనానికి, ఎముకలలోని మజ్జకు, తుప్పుగల ఇనుముకు, వ్రణాలకు, దెబ్బ సెప్టిక్ అవ్వడానికి, బెల్లంలోని ఐరన్‌కు అధిపతి కుజుడే. కుజగోళం ఆకాశంలో ఎర్రగా కనిపిస్తుంది. ఆ ఎరుపు కారణం ఆ గోళం మీద తుప్పుపై సూర్యకాంతి పడటమే. శరీరంలో ఐరన్ అధికంగా వుంటే దెబ్బలు తొందరగా తగ్గుతాయి. అవి లోపించిన దెబ్బపై తుప్పు ఇనుము తగిలినా సెప్టిక్ అవుతుంది. బెల్లాన్ని శరీరంలో ఇముడ్చుకొనే శక్తి లోపించినపుడు ఆ బెల్లమే వ్రణాలను తగ్గకుండా చేస్తుంది. ఎముకలలోని మజ్జలో పగడం కలిసిపోతుందని ఫ్రాన్స్ వైజ్ఞానికుల అభిప్రాయం. పగడం కుజునికి చెందిన రత్నం. కుజుడు శరీర పుష్టికి ప్రాధాన్యం ఇచ్చే గ్రహం. అతని ధాన్యమైన కందిపప్పు శరీర పుష్టినిస్తోంది. కందుల రంగు ఎరుపే.

బుధుడు నరాలకు సంబంధించిన గ్రహం. అతని రాశులు మిథున కన్యలు ధాన్యం పెసలు. కన్యా రాశి ఉత్పత్తికి, అమ్మకానికి సంకేతం. బుధుడు వ్యాపారస్థుడు. అతని రంగు ఆకుపచ్చ. ఆ రంగు ఉత్పత్తికి సంకేతమని ఆధునిక వైజ్ఞానికుల అభిప్రాయం. పెసల రంగూ ఆకుపచ్చేనని అవి నరాల నిస్సత్తువను తొలగిస్తాయని ఆహార వైద్యుల అభిభాషణం. బుధుడు

సమయస్ఫూర్తికి అధిపతి. అది లోపించడం బుద్ధిమాంద్యం. పెసలలోనూ బుధునికి చెందిన వసలోను ఆ బుద్ధిమాంద్యాన్ని తగ్గించే లక్షణం ఉంది.

గురుడు పసుపుకు, పంచదారకు, షుగర్ వ్యాధికి, శనగలకు, సంబంధించిన గ్రహం. పంచదారను జీర్ణించుకుంటే షుగర్ వ్యాధిరాదు. అది జీర్ణించుకోలేనప్పుడు ఏర్పడే పుళ్ళుకు వేప, పసుపు మందులైతే పంచదార, శనగలు పుళ్ళు తగ్గకుండా చేస్తాయి. గురుడు మేధావి. మేధావులు ఆలోచనలు చేస్తారు. వ్యాయామం చేయరు. ఆ రెండు లక్షణాలే షుగర్ వ్యాధిని పుట్టిస్తాయి. పసుపు షుగర్ వ్యాధి తగ్గిస్తుందని వ్యాయామం షుగర్ రాకుండా చేస్తుందని వైద్యుల అభిప్రాయం. విశేషించి గురునికి చంద్ర, కుజ శనులను దోష రహితులగా చేసే ప్రత్యేక లక్షణం ఉంది.

చంద్రుడిచ్చే జబ్బులకు శనిచ్చే వాతానికి పసుపు మంచి మందు. టి.బి.కి కూడా చంద్రుడే అధిపతి. దాన్ని నివారించే శక్తి వెన్న కలిపిన పసుపుకున్నది. శుక్రుడు సౌందర్యానికి, నిమ్మపండుకు, తేనెకు, చింతపండుకు, చర్మానికి అధిపతి. సౌందర్యాన్ని చింతపండు, నిమ్మపండు పెంపొందించడం లోక ప్రసిద్ధమే. తేనె కూడా ఈ విషయంలో సహకరిస్తుంది. అది పుష్పాలనుండే వస్తుంది. పుష్ప జాతులు సౌందర్యానికి సౌకుమార్యానికి ప్రతీకలు. శని, వాత లక్షణం కలవాడు. చర్మంలోని మాలిన్యాలను వెలువరించే శక్తికి ఈతడు అధిపతి. నువ్వులకు, ఊపిరితిత్తులకు కూడా అధిపతే. ఊపిరితిత్తులు చేసే పని వాయువును క్రమబద్ధం చేయడమే. వాతం అంటే వాయు దోషమే కదా! మాలిన్యాలను వెలువరించే లక్షణం ఊపిరితిత్తుల పనిని క్రమబద్ధం చేసే లక్షణం నువ్వులకు ఉందని ఆయుర్వేద విజ్ఞానం చెపుతూంది. నువ్వుల నూనె శరీరానికి పట్టించి తైలాభ్యంగనం చేస్తే రోమకూపాలు శక్తివంతమై చర్మంలోని మాలిన్యాలను తొలగిస్తాయి.

ఇలా గ్రహాలకు చెందిన లేదా పొంతన వున్న వస్తువులు గ్రహాలవల్ల కలిగే అనారోగ్యాలను తొలగిస్తున్నాయి. విశేషించి ఆ యా గ్రహాలు ఉచ్చ

స్వక్షేత్రాదులలో బలంగా ఉన్నప్పుడు ఆయా పంటలు ఎక్కువగా పండి దేశ ప్రజలందరికి అందుబాటులో ఉంటున్నాయి. ఇలా మూలకాలవరకు వెళ్ళినా ఏడు రకాల పదార్థాలే మిగులుతున్నాయి. స్వరాలు ఏడు. రంగులు ఏడు. మానవ మనస్తత్వాలు ఏడు. శరీరంలోని ధాతువులు ఏడు. పంచభూతాలు, మనస్సు, ఆత్మ కలిపితే ఏడు. నోటికి రుచి తెలిసేది ఏడు నిమిషాలు. ముక్కుకు వాసన తెలిసేది ఏడు నిమిషాలు. వంశపారంపర్యంగా రోగాలుండేవి ఏడు తరాలు. శరీరంలోని కణాలన్నీ మారడానికి పట్టే కాలం ఏడు సంవత్సరాలే. సప్త గ్రహాల సామ్రాజ్యాన్ని అర్థం చేసుకుంటే ఆనంద సామ్రాజ్యాన్ని, ఆరోగ్య సామ్రాజ్యాన్ని మనమేలుకోవచ్చు. మనవారి మేలుకోరవచ్చు.

# 4. గ్రహ గమనాలు – దశలు

ఆకాశంలో గ్రహాలు సంచరిస్తున్నాయి. రాశి చక్రాన్ని చుట్టి రావడానికి వేరువేరు గ్రహాలకు పట్టేకాలం వేరువేరుగా ఉంటుంది. సూర్యుడు రాశి చక్రాన్ని పూర్తిచేసినట్లు కనిపించడానికి పట్టేకాలం ఒక సంవత్సరం అంటే భూమి సూర్యుని చుట్టూ తిరిగిరావడానికి సంవత్సరం పడుతుంది. చంద్రుడు రాశి చక్రాన్ని 27 రోజుల్లో చుట్టివస్తాడు. కుజుడు ఒక సంవత్సరం ఆరు మాసాల్లో తిరిగివస్తాడు. గురుడు 12 సంవత్సరాలలో తిరిగవస్తాడు. ఒక రాశిలో సంచరించడానికి ఒక సంవత్సరం పడుతుంది. శనైశ్చరుడు అంటే నెమ్మదిగా నడిచేవాడు. ఇతడు రాశి చక్రాన్ని పూర్తి చేయడానికి 30 సంవత్సరాలు పడుతుంది. గురుశనులు మాత్రమే రాశి చక్రంలో దీర్ఘకాల ప్రయాణం చేస్తారు. రాహుకేతువులు 18 సంవత్సరాల కాలంలో రాశి చక్రాన్ని పూర్తి చేసి తిరిగి వస్తారు. కాని అవి ఛాయా గ్రహాలు కావడంవల్ల. గురుశనులకున్న ప్రాధాన్యం వారికి లేదు. గురుడు, శని గమనంలో ఏకీభవించడానికి పట్టే కాలంలో కనిష్ట సామాన్య గుణిజ సంఖ్య 60. ప్రభవ మొదలైన 60 సంవత్సరాల గణన ఇలాగే వచ్చింది. గోచారంలో 12 సంవత్సరాల చక్రం 30 సంవత్సరాల చక్రం మొదలైనవి ఉన్నాయి. అవి గురు, శనుల రాశి గమనంపై ఆధారపడి ఉంటాయి. ఫలాలు పునరావృతం అవుతాయన్నమాట.

యుగం అనే పదం కాల వాచకంగా ఉంది. కాని ఆ పదానికి అర్థం జంట. కాలం లెక్కించే అంశాలలో జంటలు చాలా ఉన్నాయి. సూర్యుడు కనిపించడం, కనిపించక పోవడం అనే అంశాలపై పగలు రాత్రి అనే జంట ఆధారపడి ఉంది. కృష్ణ పక్షం, శుక్ల పక్షం చంద్రుని వృద్ధి క్షయాలపై ఆధారపడి ఉన్నాయి. ఉత్తరాయణ దక్షిణాయనాలు సూర్యుని గమనం, ఉత్తర గమనం, దక్షిణ గమనం అనే అంశాలపై ఆధారపడినవి. ఇవి జంటే. ఐదు సంవత్సరాలలో రెండు అధిక మాసాలు వస్తాయి. కాబట్టి పంచవర్షాత్మక యుగం అనే వ్యవహారం వచ్చింది. అలాగే 60 సంవత్సరాలలో

శని రాశి చక్ర భ్రమణములు రెండున్నాయి. 60 సంవత్సరాలయ్యేటప్పటికి గ్రహాలన్నీ ప్రారంభమైన స్థానానికి చేరుకుంటాయి. అంటే ప్రతీ ప్రభవ సంవత్సరంలోనూ గ్రహాలన్నీ సుమారు గత ప్రభవలో వున్న చోటే ఉంటాయి. వ్యక్తి జీవితంలో కూడా రెండు 60 సంవత్సరాలు పూర్తైతే అది పూర్ణాయుర్దాయం 120 సంవత్సరాలని జ్యోతిశ్శాస్త్రం వ్యవహరిస్తోంది.

120 సంవత్సరాలను తొమ్మిది గ్రహాలకు పంచగా వింశోత్తరి మహాదశలు అంతర్దశలు ఏర్పడ్డాయి. వ్యక్తి యొక్క ఆలోచన జీవన గమనం ఒక రోజులో వ్యక్తి ప్రవర్తన కలియుగాదినుండి కాలసంబంధ ప్రవర్తన కూడా ఈ గ్రహాల క్రమంలోనే కొనసాగుతున్నాయి.

రవి గంభీర్యానికి భావగ్రహణకు సమర్థవంతమైన పాలనకు అధిపతి. రవి, చంద్ర, కుజ, రాహు, గురు, శని, బుధ, కేతు, శుక్రులు జీవితంలో వరుసగా నడుస్తుంటారు అని జ్యోతిశ్శాస్త్ర సాంప్రదాయం. ఒక రోజులో ఒక వ్యక్తి ప్రవర్తనను పరిశీలిద్దాం. లేచిన వెంటనే గంభీరంగా ఉంటాడు. ఈ స్థితికి అధిపతి రవి. తాను ఆ రోజు చేయవల్సిన పనులను గూర్చి సమగ్ర ఆలోచన చేస్తాడు. ఆలోచనకు అధిపతి చంద్రుడు. ఆ తరువాత ఆహారం తీసుకొనే ప్రయత్నం చేస్తాడు. ఆహారానికి కూడా అధిపతి చంద్రుడే. తర్వాత తాను నిర్ణయించుకొన్న పని చేయటానికి ఉద్వేగపడతాడు. దానికి అధిపతి కుజుడు. ఆ పని నిర్వర్తించడానికి పని ఉన్న స్థానానికి చేరుకుంటాడు. ఆ ప్రయాణానికి అధిపతి రాహువు. పని ప్రదేశానికి చేరుకున్న తరువాత తాను గౌరవాన్ని పొందుతాడు. ఇతరులను సాటివారిని గౌరవిస్తాడు. అది పనిపై వున్న గౌరవానికి సంకేతం. ఆ గౌరవానికి గురుడధిపతి. పని ప్రారంభిస్తాడు. ఆ కార్యదీక్షకు శని అధిపతి. ఆ పని కొంత సాగించిన తరువాత ఏర్పడే బద్ధకానికి, అలసటకు కూడా అధిపతి శనే. ఆ పని వలన కలిగే ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకొని ఉత్సాహం తెచ్చుకుని పని చేస్తాడు. ఆ ప్రయోజన దృష్టికి అధిపతి బుధుడు. పని పూర్తైన వెంటనే కలిగే అలసటకు నిర్వేదానికి అధిపతి కేతువు. తిరిగి ఇంటికి

రావడానికి చేయవలసిన ప్రయాణానికి కూడా అతడే అధిపతి. ఇంటికి వచ్చి విశ్రాంతి సుఖ భోజనం, భోగానుభవం, కళాప్రీతి, నిద్ర, సుఖం అనే వాటికి అధిపతి శుక్రుడు.

ఒక ఆలోచన కలిగినప్పుడు ఉండే సామాన్య స్థితికి అధిపతి రవి. ఆ పనికి సంబంధించిన సమగ్రమైన ఆలోచనకు అధిపతి చంద్రుడు. ఆ పని వల్ల వచ్చే లాభాల నిమిత్తం ఆలోచన చేసినప్పుడు పొందే ఉద్వేగానికి అధిపతి కుజుడు. ఆ పని నిమిత్తం చేసే ప్రయాణాలకు అధిపతి రాహువు. పనిని గూర్చి కలిసిన వ్యక్తులవల్ల పొందే గౌరవానికి అధిపతి గురువు. పనిలో విలీనమై కష్టపడే స్వభావానికి శని. ప్రయోజనం సాధించడానికి అధిపతి బుధుడు. ప్రయోజనం పొందిన తరువాత కలిగే అలసటకి అధిపతి కేతువు. ఆ ఫలితాన్ని అనుభవించే స్థితికి అధిపతి శుక్రుడు.

బాల్యంలో భావగ్రహణకు ప్రయత్నిస్తాడు. ఆ స్థితికి అధిపతి రవి. ఇల్లంతా పాకుతూ కన్పించినదల్లా నోట్లో పెట్టుకుంటాడు. ఈ స్థితికి అధిపతి చంద్రుడు. ఆటల పైన ఆసక్తితో విజయ కాంక్షతో దెబ్బల్ని సైతం లెక్కచేయక చూపే ఉత్సాహానికి అధిపతి కుజుడు. కొంచెం ఎదిగాక కాలయాపనపై, తిరగడంపై ఆసక్తి ఏర్పడును. ఆ స్థితికి అధిపతి రాహువు. చదువుపై ఆసక్తి పుట్టి గౌరవం సాధించాలనే తపన కల్గుతుంది. దానికి అధిపతి గురుడు. ఉద్యోగాసక్తికి అధిపతి శని. ఆ ఉద్యోగంలో ప్రయోజనం సాధించాలనో, వ్యాపారం ద్వారా ఉన్నత స్థితిని సాధించాలనో కాంక్షిస్తాడు. ఆ స్థితికి అధిపతి బుధుడు. జీవితంపై నిర్వేదంతో ఉద్యోగ విరమణ చేసే స్థితికి అధిపతి కేతువు. ఆ తరువాత ఏర్పడే భోగలాలసత్వానికి అధిపతి శుక్రుడు.

కలియుగాదిలో సమర్థులైన ప్రభువులు సాగించే పాలన రవి ప్రభావం కలది. ఆ తరువాత అసమర్థ ప్రభువులు పాలించిన కాలానికి అధిపతి చంద్రుడు. రాజ్య కాంక్ష, రక్త పిపాస కలిగియుండి యుద్ధమే లక్ష్యంగా పరిపాలన సాగిన కాలానికి అధిపతి కుజుడు. విదేశీయుల దురాక్రమణ

స్థానిక వ్యక్తులలో అనైక్యత కలిగిన కాలానికి అధిపతి రాహువు.

స్వాతంత్ర్యాభిలాష బలపడి మన సంస్కృతిపై అభిమానం పెరుగుతున్న ఈ కాలానికి అధిపతి గురుడు. ఇలా దిన చర్యలోనూ, ఆలోచనా సరళిలోనూ, జీవన క్రమంలోనూ, కాలం క్రమంలోనూ ఏర్పడే క్రమబద్ధమైన ఆలోచనలపై రవ్యాది గ్రహముల ప్రభావం ఉంటుంది. ఆ క్రమంలోనే దశలు అంతర్దశలు కూడా ఉంటాయి. జాతకునికి ఏ వయస్సుకు ఏ దశ రావాలో ఆ దశ వస్తే రాణిస్తాడు. చిన్న వయస్సులో చివరి దశలు వచ్చినా పెద్ద వయస్సులో చిలిపి దశలు వచ్చినా రాణించలేడు. వయస్సుకు తగిన ఆలోచనల వికాసం. ఈ దశాక్రమంలో ఇమిడి వుంది. ఈ గ్రహాల దశలలో రవి, చంద్ర, కుజ, కేతు దశలు చిన్నవి. రవి 6 సంవత్సరాలు. చంద్రుడు 10 సంవత్సరాలు. కుజుడు 7 సంవత్సరాలు. కేతువు కూడా 7 సంవత్సరాలే. గాంభీర్యం విషయాలోచన, ఉద్వేగం, నిర్వేదం అనే భావనలు త్వరగా మార్పులు చెందడం మనం గమనించవచ్చును. ఇందులో గంభీర్యానికి రవి, విషయాలోచనకు చంద్రుడు, ఉద్వేగానికి కుజుడు, నిర్వేదానికి, వైరాగ్యానికి కేతువు అధిపతులు. ఆశ, గౌరవం, సంపాదన దాన్ని నిలుపుకోవడం పని సాధించడానికి పడే శ్రమ, పట్టుదల, ప్రయోజనా కాంక్ష, సాధన, భోగానుభవం అనే అంశాలకు జీవితంలో పట్టే కాలం ఎక్కువ. ఆశకు అధిపతి రాహువు. గౌరవానికి అధిపతి గురుడు. పని సాధించడానికి పడే శ్రమకు అధిపతి శని. ప్రయోజనాకాంక్షకు అధిపతి బుధుడు. భోగానుభవమునకు అధిపతి శుక్రుడు. రాహు దశ 18 సంవత్సరములు. గురు దశ 16 సంవత్సరములు. శని దశ 19 సంవత్సరములు. బుధ దశ 17 సంవత్సరాలు. శుక్ర దశ 20 సంవత్సరాలు. ఈ గ్రహాలు మొత్తం 120 సంవత్సరాలు. ఆ యా సమయాలలో ఆ యా గ్రహాల ప్రభావానికి లోనైన వ్యక్తి ఆలోచనా సరళి ఆ యా రీతిల్లో కొనసాగుతుంది. ఆ విషయం ముందుగానే తెలుసుకుంటే అనుకూలంగా మలచుకునే అవకాశం వుంది.

# 5. గ్రహ రాజ్యం

గ్రహరాజ్యంలో 7 గ్రహాలున్నవి. అలాగే లోకంలో వ్యక్తుల స్వభావాలు 7 రీతులలో కన్పిస్తుంటాయి అని మనస్తత్వశాస్త్రజ్ఞుల కథనం. వాటిని కొంచెం విభజిస్తే 12 రకాలుగా తయారవుతాయి. రవి స్వభావేవ గాంభీర్యం. జ్యోతిశాస్త్రరీత్యా అతడు గ్రహరాజు. వనంలో సంచరించే జంతువులన్నింటికీ రాజుగా భావింపబడే మృగం సింహం. సింహరాశి సూర్యునికి స్వక్షేత్రం. ఎవరు ఏమంటారో, ఏమనుకుంటారో అనే భయంగల మెత్తని వాడైన చంద్రుడు జ్యోతిశ్శాస్త్ర రీత్యా రాణి. ఇతరుల కదలికలకు భయపడే పీత-కర్కాటకం ఇతనికి స్వక్షేత్రం. ఆకాశంలో ఎఱ్ఱగా కన్పించే కుజుడు ధైర్యానికి, నాయకత్వానికి, ఆత్మరక్షణకు ప్రతీక. గ్రహరాజ్యంలో యితడు సేనాధిపతి. సైన్యం రెండు రకాలుగా ఉంటుంది. ప్రత్యక్షంగా యుద్ధంచేసే సైన్యం, గూఢచారి విభాగం. కొండనైనా ఢీకొనేతత్వం గల గొర్రె-మేషం సైన్యానికి, గోడవారల నక్కుతూ ఆత్మరక్షణా నైపుణ్యంగల తేలు-వృశ్చికం గూఢచారివర్గానికి ప్రతీక. ఆ రెండు వర్గాలకి సేనానాయకుడు కుజుడే అధిపతి. ఆకుపచ్చరంగుకు అధిపతి అవుతూ, ఉత్పత్తి, వినియోగాలకు కారకుడవుతూ ఉన్న బుధుడు వ్యాపారస్థుడే. ఉత్పత్తిశక్తికి అమ్మకానికి కన్య ప్రతీక. కొనుగోలు శక్తికి మిథునం ప్రతీక. కొనేవాడికి పట్టు విడుపులున్న ద్వంద్వ వైఖరి తప్పనిసరి గదా! అందువల్ల మిథునం కొనేవాడికి ప్రతీక. ఆరెండు శక్తులు వ్యాపారస్థునికి అత్యవసరం కావడంవల్ల మిథున, కన్యలకు అధిపతి బుధుడే.

గురుడు స్వార్థరహితుడైన మంత్రి. ఇతడిచ్చే సలహాలు అందరికీ మేలు చేస్తాయి. గౌరవానికి యితడు ప్రతీక. అందుకే యితడి పేరు గురుడు. స్వార్థం లేకుండా యితరులకు సహాయం చేసే మేధాశక్తి ఇతనికుంది. అలా లోక క్షేమం కోరే వారిలో శాస్త్రజ్ఞుడు, కవి ముఖ్యులు. ఆ యిద్దరిలో మేధాశక్తి ఉంది. ఇతరులకు మేలు చేసే వితరణ శీలం ఉంది. సమాజంచే గౌరవింపబడే సహజత్వం ఉంది. గౌరవం అనేది ఏకపక్షం కాదు. అందరికీ

మేలు కోరే లక్షణంవల్లనే వారు గౌరవాన్ని ఆర్జించగల్గుతారు.

శాస్త్రజ్ఞులకు లక్ష్యసాధనాశక్తిగల ధనస్సు ప్రతీక. ఊహలలో తేలియాడే మీనం కవులకు ప్రతీక. ఆరెండింటికీ అధిపతి గురుడు. స్వార్ధానికి, భోగానికి ప్రాధాన్యతనిచ్చే మరో మేధావి శుక్రుడు. తన మేధాశక్తిని తన స్వార్థం కోసం వినియోగించుకోవడం, తాను శ్రమపడటానికి యిష్టపడకుండా యితరుల శక్తియుక్తులను తన స్వప్రయోజనం కోసం వాడుకునే తెలివితేటలు ఇతనిలో ఉన్నాయి. యితరుల కలహాలలో తీర్పుచెప్పుటకు తులరాశి ప్రతీక. ముఖ్యమైన భాధ్యతలు తనపై వేసుకొని నలుగురిచే పనిచేయించి తాను శ్రమపడి మొత్తానికి కార్యసాధన చేసి దానివల్ల తన ప్రయోజనాలను పూర్తిచేసుకోవడానికి వృషభరాశి ప్రతీక. ఆరెండింటికి అధిపతి శుక్రుడు.

యజమానికి విశ్రాంతినిస్తూ సేవ చేసే శని, నీలిరంగు కలవాడు. సేవక వర్గంలో కూడా పట్టుదలతో పని చేసేవారు, బద్ధకించి కాలక్షేపం చేసేవారు ఉంటారు. పట్టుదలకు మొసలి అంటే మకరం, బద్ధకానికి కుంభం ప్రతీకలు. ఈ రెండింటికి అధిపతి శని.

రాశిస్వభావము, దాని అధిపతి స్వభావం, అందులో ఉన్న గ్రహముల స్వభావం, ఆ రాశిని చూసే గ్రహాల స్వభావం, సమ్మిళతమైనందువల్ల అవాంతర భేదాలతో చాల రకాల స్వభావాలు బయటపడుతుంటాయి. ఈ సమిష్టి స్వరూపాలను జ్యోతిశ్శాస్త్రం విశ్లేషిస్తుంది. స్వభావానికి అనుగుణమైన ఆహారం, విద్య, వృత్తి, స్నేహసంబంధాలు, అలవాట్లు, అభిరుచులు, ఆహ్లాదాన్ని, ప్రశాంతిని, ఆరోగ్యాన్ని, ఆనందాన్ని ప్రసాదిస్తాయి. ఈ విషయాలను వివరిస్తూ వ్యక్తి యొక్క అభివృద్ధికి, ఆనందానికి, ఆధ్యాత్మిక ఔన్నత్యానికి జ్యోతిశ్శాస్త్రం మార్గాలను చూపుతుంది. అందుకే జ్యోతిశ్శాస్త్రాన్ని కరదీపిక అని కూడా అంటారు. అంతేకాక అంగాలలోనేత స్థానీయమని ప్రాచీనుల అభిప్రాయం. కన్ను, దీపం ఉంటేనే వస్తుస్వరూపం తెలుస్తుంది. మార్గనిర్దేశం కల్గుతుంది.

అజ్ఞానం, చీకటి, భయానికి, ఆందోళనకు కారణమైతే, జ్ఞానం, ధైర్యానికి, ఆనందానికి కారణమవుతుంది. గడిచిన జీవితం అందరికీ తెల్సినదే రాబోయేజీవనం భవిష్యత్తు, తెల్సుకోవడానికి జ్యోతిషం ఒకటే మార్గం. అలాంటి భవిష్యత్‌కు దర్పణం జాతకం.

గ్రహాలు సర్వకాల సర్వావస్థలలో కాంతులను వెదజల్లుతూనే ఉంటాయి. అంతటా సమానంగా కాంతి ప్రసరణ జరుగుతూంటే వేర్వేరు వ్యక్తులపై వేర్వేరు ప్రభావాలు ఎలా కల్గిస్తాయి? అనే ప్రశ్న ఒకటి ఉంది. మనం గ్రంధాలయానికి వెళ్ళినప్పుడు మనకు అంతకు ముందున్న పరిజ్ఞానానికి అనుబంధ విషయాలున్న పుస్తకాలను చదివే ప్రయత్నం చేస్తాం. మనకు అనుబంధం కాని విషయాలను విన్న వాటిని రెండో చెవిలోంచి వదిలేస్తాం. ఆ విషయాలు మనసులో ప్రవేశించలేవు. అదే విధంగా గ్రహాలు ప్రసరించే కాంతులు మనలో వున్న వాసనలనే ప్రేరేపిస్తాయి. ఆ వాసనలు జన్మించిన సమయంలోని ప్రత్యేక కిరణాల ద్వారా జాతకం ద్వారా నిర్దేశింపబడతాయి. అందువలన ఒకే కాంతికి వేరు వేరు వ్యక్తులు వేరు వేరు విధాలుగా స్పందిస్తారు.

ఎరుపు రంగు కుజునికి ప్రతీక. ఆ రంగుని చూచినపుడు బాలుడు భయాన్ని, యువకుడు అనురాగాన్ని, మనోవైకల్యం కలవాడు అవ్యక్తతను కవి ఉద్రేకాన్ని మరొకడు విప్లవాన్ని మరో కోణంలో ప్రమాదపు హెచ్చరికను తమ తమ ఆలోచనల కనుగుణంగా దాన్ని వల్ల ప్రేరణను పొందుతుంటారు. అదే విధంగా గ్రహాల ప్రభావాలను గ్రహించే వ్యక్తి వ్యక్తిత్వాన్ని అనుసరించి స్వీకరించటం జరుగుతుంది.

కాంతి ఎక్కడ ఉందో జ్యోతిషం అక్కడ ఉంది. పలు దేశాలలో పలు విధాలైన జ్యోతిష మార్గాలున్నాయి. ఆ యా శాస్త్రాల సూత్రీకరణ కూడా ఆయా పరిసరాల ప్రభావానికి అనుగుణంగా ఉంటుంది. పాశ్చాత్య స్త్రీలు సాహసవంతుడు, ధనవంతుడు, న్యాయకత్వ లక్షణాలు కలవాడైన వ్యక్తిని భర్తగా అభిలషిస్తారు. ఆ కారణాలవల్ల పాశ్చాత్య జ్యోతిషంలో కుజుడు, రవి

భర్తృకారకులు. భారతీయ వనితలు సౌమ్య స్వభావం కలవారు, ఇతరులని ఇబ్బంది పెట్టని వాడు అయిన వ్యక్తిని భర్తగా అభిలషిస్తారు. భారతీయ జ్యోతిషంలో భర్తృకారకులు చంద్ర, శుక్రులు.

అదే విధంగా సంఘటనలు తెలుసుకోవడానికి పాశ్చాత్య జ్యోతిష్కులు సౌర గోచారాన్ని అంటే తేదీలను బట్టి రాశి విభజనను పాటిస్తారు. భారతీయ జ్యోతి శాస్త్రజ్ఞులు ఆలోచనా సరళి మెరుగుపరచుకొనే ప్రయత్నంలో చాంద్రగోచారానికి అంటే జన్మ నక్షత్రాన్ని బట్టి ఏర్పడే రాశికి ప్రాధాన్యం ఇస్తారు. అన్ని విధాల విశ్లేషించి మానవుని భవితను మెరుగుపరచుకొనే ప్రయత్నం జ్యోతిశ్శాస్త్రంలో దర్శనమిస్తుంది.

# 6. జాతకం ప్రయత్నం

కాంతి పదార్థంగా, ఆహారంగా, మనస్సుగా రూపొందుతోంది. పదార్థంశక్తిగా, శబ్దంగా పరిణమిస్తోంది. ఈ మార్పులన్నింటిని వర్గీకరిస్తే ఏదైనా దేనిగానైనా మార్పు చెందుతుంది. కాబట్టి అద్వైతం స్థిరీకృతమౌతుంది. సృష్టికి మూలంగా భావించే మాయ మనసుకంటే వేరైనది కాదు. అందుకు మానవుడు సృష్టికి ప్రతి సృష్టి చేయగలుగుతున్నాడు. మనసుకున్న శక్తిని మనం 5% మాత్రమే వినియోగించుకుంటున్నామని శాస్త్రజ్ఞులభిప్రాయం.

అలా మానసిక శక్తిని, భవిష్యత్తుని తెలుసుకొనేందుకు వినియోగించే విధానాలు మానవుడు అనాదిగా కనుగొంటూనే ఉన్నాడు. ఆకాశంలో గ్రహాలు నక్షత్రాలాధారంగా జాతకాలు నిర్మించి, వాటి ఆధారంతో భవిష్యత్తును గుర్తిచే పద్ధతి చాలా కాలం నుండి వాడుకలో ఉంది. చేతిలోని రేఖల ఆధారంగా భవిష్యత్తు తెలుసుకొనే పద్ధతిని హస్త సాముద్రికం అంటారు. పుట్టుమచ్చల ఆధారంగా వ్యక్తిత్వ లక్షణాలను గుర్తించే పద్ధతిని తిలక శాస్త్రమని ఇలా పలు మార్గాలు అమలులోకి వచ్చాయి. వీటన్నిట ఉపయోగపడేది మనశ్శక్తి మాత్రమేనని మనం గుర్తించాలి. మనసుకా స్ఫురణశక్తి లేనప్పుడు ఏ శాస్త్రాధ్యయనమైనా సత్ఫలితాలను ఇవ్వలేదు. ఒక వైజ్ఞానికునికైన, ఒక వైద్యునికైనా ఆలోచన సరిగ్గా లేనపుడు సత్ఫలితాలు ఎలా సాధించగలడు? ఈ మానసిక శక్తి చాలా విచిత్రమైనది. ప్రాచీన శాస్త్రాలను అనుసరించి మనశ్శక్తి మూడు విధాలు అవి సత్వరజస్తమోగుణములు. సాత్వికమైన మనశ్శక్తి శకున, వాస్తు, జాతక, ప్రశ్న, అంగస్ఫురణాలు సాధనాల ద్వారా భవిష్యత్తులోని వాస్తవాలను ఊహించేలా చేస్తుంది. అదే తీవ్రమైనపుడు సాధనలేమి లేకుండా సత్యాలను గుర్తించగలదు. దీనినే ఋషుల త్రికాలజ్ఞతగా గుర్తించారు.

రజోగుణ ప్రధానమైన మనశ్శక్తి సృజనాత్మక నైపుణ్యాలు కలదై

భర్తృకారకులు. భారతీయ వనితలు సౌమ్య స్వభావం కలవారు, ఇతరులని ఇబ్బంది పెట్టని వాడు అయిన వ్యక్తిని భర్తగా అభిలషిస్తారు. భారతీయ జ్యోతిషంలో భర్తృకారకులు చంద్ర, శుక్రులు.

అదే విధంగా సంఘటనలు తెలుసుకోవడానికి పాశ్చాత్య జ్యోతిష్కులు సౌర గోచారాన్ని అంటే తేదీలను బట్టి రాశి విభజనను పాటిస్తారు. భారతీయ జ్యోతి శాస్త్రజ్ఞులు ఆలోచనా సరళి మెరుగుపరచుకొనే ప్రయత్నంలో చాంద్రగోచారానికి అంటే జన్మ నక్షత్రాన్ని బట్టి ఏర్పడే రాశికి ప్రాధాన్యం ఇస్తారు. అన్ని విధాల విశ్లేషించి మానవుని భవితను మెరుగుపరచుకొనే ప్రయత్నం జ్యోతిశ్శాస్త్రంలో దర్శనమిస్తుంది.

# 6. జాతకం ప్రయత్నం

కాంతి పదార్థంగా, ఆహారంగా, మనస్సుగా రూపొందుతోంది. పదార్థంశక్తిగా, శబ్దంగా పరిణమిస్తోంది. ఈ మార్పులన్నింటిని వర్గీకరిస్తే ఏదైనా దేనిగానైనా మార్పు చెందుతుంది. కాబట్టి అద్వైతం స్థిరీకృతమౌతుంది. సృష్టికి మూలంగా భావించే మాయ మనసుకంటే వేరైనది కాదు. అందుకు మానవుడు సృష్టికి ప్రతి సృష్టి చేయగలుగుతున్నాడు. మనసుకున్న శక్తిని మనం 5% మాత్రమే వినియోగించుకుంటున్నామని శాస్త్రజ్ఞులభిప్రాయం.

అలా మానసిక శక్తిని, భవిష్యత్తుని తెలుసుకొనేందుకు వినియోగించే విధానాలు మానవుడు అనాదిగా కనుగొంటూనే ఉన్నాడు. ఆకాశంలో గ్రహాలు నక్షత్రాలాధారంగా జాతకాలు నిర్మించి, వాటి ఆధారంతో భవిష్యత్తును గుర్తించే పద్ధతి చాలా కాలం నుండి వాడుకలో ఉంది. చేతిలోని రేఖల ఆధారంగా భవిష్యత్తు తెలుసుకొనే పద్ధతిని హస్త సాముద్రికం అంటారు. పుట్టుమచ్చల ఆధారంగా వ్యక్తిత్వ లక్షణాలను గుర్తించే పద్ధతిని తిలక శాస్త్రమని ఇలా పలు మార్గాలు అమలులోకి వచ్చాయి. వీటన్నిట ఉపయోగపడేది మనశ్శక్తి మాత్రమేనని మనం గుర్తించాలి. మనసుకా స్ఫురణశక్తి లేనప్పుడు ఏ శాస్త్రాధ్యయనమైనా సత్ఫలితాలను ఇవ్వలేదు. ఒక వైజ్ఞానికునికైన, ఒక వైద్యునికైనా ఆలోచన సరిగ్గా లేనపుడు సత్ఫలితాలు ఎలా సాధించగలడు? ఈ మానసిక శక్తి చాలా విచిత్రమైనది. ప్రాచీన శాస్త్రాలను అనుసరించి మనశ్శక్తి మూడు విధాలు అవి సత్వరజస్తమోగుణములు. సాత్వికమైన మనశ్శక్తి శకున, వాస్తు, జాతక, ప్రశ్న, అంగస్ఫురణాలు సాధనాల ద్వారా భవిష్యత్తులోని వాస్తవాలను ఊహించేలా చేస్తుంది. అదే తీవ్రమైనపుడు సాధనలేమి లేకుండా సత్యాలను గుర్తించగలదు. దీనినే ఋషుల త్రికాలజ్ఞతగా గుర్తించారు.

రజోగుణ ప్రధానమైన మనశ్శక్తి సృజనాత్మక నైపుణ్యాలు కలదై

సృష్టించే వస్తువు యొక్క రూపాన్ని మనసులోనే రూపకల్పన చేయగలదౌతుంది. అలా సృష్టించే వ్యక్తులను, కళాకారులను మేధావులుగా గుర్తిస్తుంది సమాజం.

లోకంలో కొందరు తిట్టిన తిట్లు నిజమౌతాయని నరుని కంట నల్లరాయైన బ్రద్దలౌతుంది. దృష్టిదోషం చాలా శక్తివంతమైనదని అంటుంటారు. అది ఎంతవరకు నిజం అనేదే ప్రశ్న? సాత్విక మనశ్శక్తితో అనుసంధానమైన వాక్శక్తే ఋషులిచ్చే వరాలు. రాజస మానసిక శక్తులతో అనుసంధానమైన వాక్శక్తే మహాత్ములిచ్చే ఆశీర్వచనములు. ఇక తామస మానసిక శక్తితో అనుసంధానమైన దృష్టి శక్తే తిట్లు శాపనార్థాలు. ఆ తామస శక్తితో అనుసంధానమైన దృష్టిశక్తే దృష్టి దోషం.

మనసుకున్న శక్తిని సద్వినియోగ చేసుకోగలవారు సాత్విక మనశ్శక్తి కలవారు. వారి స్వార్థ రహిత మనశ్శక్తి ద్వారా అందరికి శ్రేయస్సు కలుగుతూంటుంది. కీర్తి, ధనం మొదలైన స్వల్ప ప్రయోజనాలను ఆశిస్తూ ఇతరుల మేలు కోరేవారు తమను ఆశ్రయించిన వ్యక్తులను ఆశీర్వదిస్తూంటారు. అదే రాజస శక్తి.

ఇతరుల వలన అకారణంగా మనసు కష్టపడినపుడు అసూయాది మానసిక దోషాల వలనో తిట్టినపుడు వాక్శక్తి, ఇతరుల సుఖం చూసి ఓర్వలేనపుడు దృష్టి దోషం సంభవిస్తూంటాయి. వీటి వలన ఇతరులకు అపకారం చేయడం సంభవిస్తుందే తప్ప తమకు లభించే సుఖం ఏమీ లేదు. విశేషించి సాత్వికంగా మనశ్శక్తిని వినియోగించినపుడు తనకు ఇతరులకు కూడా ఆనందప్రదమే అవుతూ ఆ శక్తి పెరుగుదలకు తోడ్పడుతుంది. రాజసంగా ఆ శక్తిని వినియోగించినపుడు శక్తి ఖర్చు అవుతుంది. దాన్ని పెంచుకోడానికి మరల సాధన చేయవలసి వస్తుంది. తామసంగా శక్తిని వినియోగించినపుడు తక్కువ పనికే ఎక్కువ శక్తి వినియోగమవుతూ వ్యక్తి క్రమంగా పతనమౌతాడు. ఆధునిక వైద్యుల అభిప్రాయం ప్రకారం కోపం వచ్చినపుడు శరీరంలో ఎక్కువ శక్తి ఖర్చు అవుతుందని తెలుస్తోంది. కోపం

తగ్గిన తరువాత వ్యక్తి నీరసం పొందడం అనుభవంలోని విషయమే.

అందువలన కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యాలనే అంతశ్శత్రువుల వలన వ్యక్తికి అభివృద్ధి నిరోధించబడుతుంది. తన స్థాయికి మించిన కోరికలను పొంది అవి తీరక కోపం పొందితే ఆ కామం అంతశ్శత్రువులలోనిది. తన స్థాయికి తగిన ధర్మానికి సాంఘిక న్యాయానికి విరుద్ధంకాని కోరికలను మాత్రమే కోరితే ఆ కామం ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలోనిదౌతుంది.

జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు, ధార్మికుడు, స్వార్థం లేనివాడు, అపకారం చేసినవారికి కూడా ఉపకారాన్ని మాత్రమే కోరేవాడు కావాలని జ్యోతిశ్శాస్త్రం చెబుతోంది. అలాగే జాతకం ద్వారా ఆ వ్యక్తి యొక్క స్థాయిని గుర్తించి తీరే అవకాశమున్న సాంఘిక, న్యాయ సంబద్ధమైన కోరికలను మాత్రమే ప్రోత్సహించడం ద్వారా వ్యక్తి యొక్క నైతిక ప్రవర్తనను ప్రోత్సహించే అవకాశం ఉంది. జాతకంలోని దోషాలను తొలగించుకోడానికి ఆధ్యాత్మిక ప్రయత్నాలు సూచించడం ద్వారా వ్యక్తిని సంస్కరించే అవకాశం ఉంది. ఇలా వ్యక్తిని మంచి మార్గంలో ప్రవేశపెట్టడానికి జ్యోతిష దర్శనం ఉపకరిస్తుంది.

వ్యక్తి జీవనంలో కష్టసుఖాలు రెండూ కలసి కనిపిస్తుంటాయి. మంచి దశలు వేరుగా, చెడ్డ దశలు వేరుగా ఉన్నప్పుడు మంచి చెడులు రెండూ కలిసి కన్పించడానికి కారణం ఏమిటి? అని ప్రశ్న ఎదురౌతూ ఉంటుంది. జాతకంలో 12 భావాలుంటాయి. సమస్త వ్యవహారాలు ఆ 12 భావాలలోనే ఇమిడి ఉంటాయి. ఉదాహరణకు వ్యక్తి సామర్థ్యం లగ్నంలో ఉంటుంది. మాట విలువ ద్వితీయంలోను, ఇతరుల సహకారం తృతీయంలోను స్థిరాస్థి సుఖం చతుర్థంలోను, ఆలోచనాశక్తి పంచమంలోను, విజయం షష్ఠంలోను, జీవిత భాగస్వామి సప్తమంలోను, ఆరోగ్యం అష్టమంలోను, అదృష్టం నవమంలోను, అధికారం దశమంలోను, లాభం ఏకాదశంలోను, ఖర్చు ద్వాదశంలోను కన్పిస్తాయి. లగ్నంలో ఉన్న గ్రహం సామాన్యంగా

సామర్థ్యాన్ని ఇస్తాడు. సామర్థ్యంతో కార్యం నిర్వహించినప్పుడు పని పూర్తి కావచ్చు గాని లాభ ప్రదం కావాలనే నియమం లేదు. సామర్థ్యం లోపించిన వ్యక్తి ఇతరుల సహకారంతో లాభాన్ని పొందుతాడు. సహకారం లోపించిన వ్యక్తి భాగస్వాములతో కలసి వ్యాపారం చేయవచ్చు. ఇలా ఏయే అంశాలలో గ్రహం అనుకూలిస్తే ఆయారంగాలలో లాభాన్ని పొందవచ్చు.

అలాగే స్థిరాస్థి స్థానం 4వది. ఆ భావానికి గురు సంబంధం ఉన్నప్పుడు గృహలాభం, కుజ సంబంధం ఉన్నప్పుడు భూలాభం, బుధ సంబంధం ఉన్నప్పుడు వ్యాపారసంస్థలు నిర్మించడం మొదలగునవి జరుగుతాయి.

ఒకే సందర్భంలో తల్లి గతించడం, వృత్తిలో అభివృద్ధి రావడం, సంతానానికి ఇబ్బంది కలగడం, ఆర్థిక లాభం రావడం మొదలైన మంచి చెడ్డలు కలసి కనిపిస్తాంటాయి. అంటే చతుర్థంలో లోపం వల్ల తల్లికి దోషం. దశమంలో గుణం వల్ల వృత్తిలో అభివృద్ధి కన్పించాయన్న మాట. అలాగే పంచమంలో లోపం వల్ల సంతానానికి దోషం, ద్వితీయంలో గుణం వల్ల ఆర్థిక లాభం కనిపిస్తాయి. లోకంలో పూర్తి చెడ్డ వాడు, పూర్తి మంచివాడు లేనట్లే జాతకంలో కూడా పూర్తి మంచి దశ, పూర్తి చెడు దశ ఉండవు. ఇదే విధంగా దశలనుబట్టి మనస్సు వ్యవహరిస్తూంటుంది. మనస్సును అధ్యయనం చేస్తే భవిష్యత్తులోని కష్టసుఖాలను అర్థం చేసుకోవచ్చు. దానికి ధ్యానమార్గం, ఇతరులకు కష్టం కలిగించని ప్రవర్తన, వీలైనంత వరకు దైవాన్ని సకల జీవులలో సందర్శించడం మొదలగు ప్రక్రియలద్వారా సత్వగుణాన్ని వృద్ధి చేసుకుంటే మన భవిష్యత్తును అర్థం చేసుకోవడంతో పాటు మనం ఉత్తమ పౌరులుగా వ్యవహరించవచ్చు. మన చుట్టూ ఉన్న వారికి మార్గ దర్శకులం కావచ్చు. సమ సమాజ స్థాపనకు, సత్ప్రవర్తనను ప్రేరేపించడంలో వ్యక్తి ప్రవర్తన ముఖ్యం కదా!

జాతకాన్ని తెలుసుకోవడం ద్వారా దాన్ని అనుభవించడమేనా! దానిలోని చెడ్డ ఫలితాలను తొలిగించుకోవచ్చా! అనే సందేహాలు

కలుగుతుంటాయి. రాబోయే మంచిని తెల్సుకోవడం ద్వారా వ్యక్తిలోని కృషీశీలత నశిస్తుందని, రాబోయే చెడ్డను ముందుగా తెల్సుకోవడం ద్వారా వ్యక్తి ఆ విషయం తెల్సుకున్నప్పటి నుండి మానసికంగా కృంగి పోయే అవకాశం ఉందని అందువలన భవిష్యత్తును తెల్సుకోవడం పూర్తిగా అనవసరం అనే వాదన కూడ ఉంది.

జాతకం భవిష్యత్తును సూచిస్తుంది. కర్మ సిద్ధాంతాన్ని అనుసరించి పూర్వ జన్మ కర్మకు ఫలితాన్ని సూచించేదే జాతకం. దానిని దైవమని, అదృష్టమని వ్యవహరిస్తుంటారు. నిహన్యాద్దుర్బలం, దైవం పురుషేణ విపశ్చితా అని పెద్దల మాట. పురుషుడు తన ప్రయత్నం ద్వారా పూర్వ కర్మను జయించాలి అని ఆ వాక్యానికి భావం. అలాగే ఆ షష్ఠం మానుషం ప్రోక్తం సప్తమాద్దైవ చింతనం అనేది మరో శాస్త్రవచనం. పదింట ఆరువంతులు పురుష ప్రయత్నం తక్కిన 4 వంతులు జాతకబలమని అర్థం. ప్రయత్నం రెండు విధాలు. ఆధ్యాత్మిక, లౌకికం, వ్యక్తి జాతకం ద్వారా తనలో కలిగిన భావాలలో మంచి భావాలకు బలం పెంచుకోవడానికి దుష్ట భావాలను బలహీన పరుచుకోవడానికి ఆధ్యాత్మిక ప్రయత్నం 3 వంతులు చేయాలి. అలా వివేకాన్ని పొంది 3 వంతులు లౌకిక కృషి చేస్తే అవాంఛనీయ సంఘటనలకు మనిషిలోను కాకుండా సహకరిస్తుంది. మొత్తం 6 వంతుల కృషితో 4 వంతుల జాతకాన్ని జయించవచ్చు. అలా కాని పక్షంలో తనకున్న అత్యాశ మొదలైనవి వాటికి లొంగి పతనం అయ్యే ప్రమాదం ఉంది. అందువల్ల తన స్థాయి తెల్సుకొని స్థాయికి తగిన సాంఘిక, న్యాయ బద్ధమైన కోరికలకు కృషి చేయడానికి తన జీవితాన్ని క్రమబద్ధం చేసుకోవడానికి జాతకం ఉపకరిస్తుంది. జాతకంలోని చెడ్డ ఫలాలను తన కృషి ద్వారా బలహీన పర్చుకోవచ్చు. బహు భార్యాయోగం ఉంది. గత కాలంలో ఎక్కువమంది వివాహం చేసుకుంటే గొప్పగా భావించేవారు. ఆనాటి సాంఘిక పరిస్థితి అది. ప్రస్తుత కాలంలో జాతకంలోని బహు భార్యాయోగాలు చట్టానికి లోబడి సామాజిక పరిస్థితుల దృష్ట్యా

ఆచరణీయాలు సమర్థనీయాలు కావడం లేదు. ఇది ఒక మంచి పరిణామం. ఈ దృష్ట్యా చూస్తే జాతకం ఇటువంటి వ్యక్తిలో సాంఘిక జీవనాన్ని మెరుగుపర్చే విధంగా ధనం, మనశ్శక్తిని సక్రమం చేసుకోవడానికి జపం, శరీరవ్యాయామానికి సౌర తేజస్సు వినియోగానికి ఉపకరించే విధంగా సూర్య నమస్కారాలు, ములికా శక్తిని వినియోగించుకొనే విధంగా ఔషధ స్నానం, హోమం మొదలైన ప్రక్రియలు శారీరక, మానసిక, ఆరోగ్యాలను క్రమబద్ధం చేసే విధంగా జ్యోతిషం శాంతులను సూచిస్తుంది. ఈ శాంతుల ద్వారా మనస్సు ప్రశాంతిని సాధిస్తుంది. వ్యక్తి సంఘంలో కలసి సుఖదుఃఖాలను పంచుకునే నేర్పును పొందుతాడు. కోరికలను అదుపు చేసుకోవడం, నేర్చుకుంటాడు. తన ప్రవర్తనను క్రమబద్ధం చేసుకుంటాడు. తాను ఉత్తమ పౌరుడవుతూ, ఉత్తమ సంతానాన్ని పొంది వారి జీవితాన్ని గూడ సక్రమంగా ఉండేలా చేసి ఉత్తమ సంఘనిర్మాణానికి కారకుడవుతాడు. ఇలా జ్యోతిషం అనిర్వచనీయమైన ఉపకారాన్ని, ప్రశాంతతను, ఆనందాన్ని ప్రసాదించే ఉత్తమ శాస్త్రమే.

# 7. రాశినామాలు - రూపకల్పన

అణువులో ఏమి ఉందో విశ్వంలోను అదే ఉందని ప్రాచీనులైన మేధావులు గుర్తించారు. ఈ శరీరంలో 27 వేల లక్షల కోట్ల కణాలు ఐదుకోట్ల అంతస్థరీయ ఆలోచనలు, భావోద్రేకాలు కలసి కాపురం చేస్తున్నాయి. ఈ ఇరువై ఏడువేల లక్షల కోట్ల కణాలు 27 నక్షత్రాలకు ఐదుకోట్లు అంతస్థరీయ ఆలోచనలు కుజాదిగ్రహాలకు, పంచభూతాలకు ఆధీనంలో ఉంటాయి. ప్రాచీన కాలంనుండి జ్యోతిర్విజ్ఞానం వృద్ధి చెందుతూనే ఉంది. ''సూర్య ఆత్మా జగతః'' చంద్రమా మనసోజాతః'' అనే వేదవాక్యాలు ఆత్మశక్తికి, మనః శక్తికి సూర్య చంద్రులతో గల సంబంధాలను వ్యక్తీకరిస్తున్నాయి. ఈ విశ్వంలో పరార్థం శక్తిగా కాంతిగా శబ్దంగా మార్పు చెందుతోంది. కాంతి జ్ఞానాన్ని అందిస్తోంది. అంటే ఒకే వస్తువు వేరు వేరు స్థితులలో వేరు వేరు రూపాలతో దర్శనమిస్తోంది సూర్య చంద్రుల స్తోత్రాలు వేదాలలో విస్తారంగా ఉన్నాయి. అంటే వేద కాలానికి పూర్వంనించి గ్రహాల పరిశీలన ఉందని అర్ధమౌతోంది. ఇలా ఆకాశాన్ని పరిశీలిస్తున్న మానవుడు సూర్యుని కాంతి ద్వారా దిక్, దేశ, కాలాలను పరిశీలించడం ప్రారంభించాడు. రాత్రి పగలు ఒక దాని వెంట ఒకటి వస్తాయి. వాటిని వందలకొలదీ లెక్కించడం కష్టం. చంద్రుడు ఒక సారి పూర్తిగా బింబంగా కన్పించి మరోసారి అసలు కన్పించకపోవడాన్ని గమనించాడు. ఆ రెండింటికి మధ్య అంతరం సుమారు 30 రోజులని గుర్తించాడు. ప్రతీ పూర్ణిమ నాడు ఒక ఆకారంగల చుక్కల గుంపు దగ్గిర చంద్రుడుండడాన్ని గమనించాడు. అదే చుక్కల గుంపు దగ్గిరకు రావడానికి 354 రోజులు పడుతుంది. సూర్యుడు ఉన్నచోటునుండి కదలి మళ్ళీ అదే చోటుకు రావడానికి 365 రోజులు పడుతుంది. అలాంటి సౌర సంవత్సరంలో 12 సార్లు చంద్రుని వృద్ధి క్షయాలు జరుగుతున్నందువల్ల ఆకాశాన్ని 12 నక్షత్రాల గుంపులుగా అంటే రాశులుగా విభజించుకున్నాడు. ఆరాశుల్లో గ్రహాల గమనాలననుసరించి రాబోయే వర్షాన్ని, ఎండల్ని, చలిని

ముందుగా ఊహించడం నేర్చుకున్నాడు.

ఒక నక్షత్రం నుండి బయలుదేరిన చంద్రుడు మళ్ళీ అదే నక్షత్రం దగ్గరకు రావడానికి పట్టిన సమయం 27 రోజులని గమనించాడు. అందుకని ఆకాశాన్ని 27 నక్షత్రాలుగా 12 రాశులుగా విభజించాడు. ఒక్కొక్క నక్షత్రంలో ఒక్కొక్క రాశిలో గ్రహాలు సంచరించేటప్పుడు ప్రకృతిలో వస్తున్న మార్పులను గమనించాడు. ఈ గ్రహాలకు ప్రకృతిలో మార్పును తీసుకువచ్చే శక్తి ఉందని గ్రహించాడు. వాటి ఆధారంగా ప్రకృతిలో రాబోయే మార్పును కూడా ఊహించడం ఆరంభించాడు. ప్రకృతిపై ఈ గ్రహాలకు ప్రభావం ఉన్నప్పుడు అది కూడా మారే రాశులను బట్టి మారుతున్నప్పుడు వ్యక్తులపై కూడ ఆ ప్రభావం ఎందుకుండదు అని ఆలోచించాడు. నిరంతర పరిశీలన, పరీక్షణ సవరణ, సూత్రీకరణల ద్వారా ఆ భేదాల్ని వర్గీకరించాడు.

ప్రకృతిని పరిశీలించే మానవుడు జంతువుల స్వభావాలను వంటపట్టించుకున్నాడు. వ్యక్తుల స్వభావాన్ని ఒక్క మాటలో చెప్పడానికి ఇప్పటికీ జంతువులతో పోలుస్తూండటం కన్పిస్తూనే ఉంటుంది. ఉదా:- కవి వృషభం, వాడు సింహం, తేలుకొండి, మేకపోతుగాంభీర్యం, మొదలైన పోలికలు ప్రసిద్ధాలే. చురుకైనవాణ్ణి గుఱ్ఱం అనడం మోసగాడిని నక్క అనడం పార్టీలు మార్చే నాయకుడ్ని ఊసర వెల్లి అనడం పరిపాటి అలా ఆ యా రాశులలో చంద్రుడుండగా వ్యక్తులలో కలిగే స్వభావాలు సూర్యుడుండగా కలిగే స్వభావాలు పరిశీలించిన మీదట ఆయా రాశుల్లో ఆయా జంతువుల ఆకారాలు ఊహించుకుంటూ వేలాది సంవత్సరాల పరిశోధించి ఆయా రాశులకు ఆయా నక్షత్రాలకు ఆ పేర్లు పెట్టడం జరిగింది.

జ్యోతిశ్శాస్త్ర రీత్యా పరిశీలన చేసినప్పుడు ఆయా రాశులవారి లక్షణాలను ఆయా జంతువుల లక్షణాలను పోల్చి చూస్తే ప్రాచీన పరిశోధకుల ప్రజ్ఞ అవగతమవుతుంది.

**మేషం :-** మేషం అంటే గొర్రె. గొర్రెకుండే లక్షణాలను మేషరాశివారికి ఉండే లక్షణాలను పరిశీలిస్తే పోలికలు చాలానే ఉంటాయి. ఈ రాశివారు విశాలమైన ముఖం, పొడవైన మెడ, బిరుసు వెంట్రుకలు, సన్నని చుబుకం, ఒత్తైన కనుబొమలు, ఉష్ణతత్వం కలిగి ఉంటారు. ధైర్యం అధికంగా ఉన్నందువల్ల ప్రతీ పనిని ఆకస్మికంగా ప్రారంభిస్తారు. తగాదాలకు వెనుదీయరు. నిర్భయంగా ఎదుటివారితో ఉన్నదున్నట్లు, మాట్లాడతారు. ఇతరుల అభివృద్ధిని చూచినప్పుడు వారిని అతి క్రమించాలనే పట్టుదల కలిగి ఉంటారు. వీరికి చిన్న తనంలో కష్టాలున్నా రాను రాను సుఖాలు పెరుగుతాయి. ఏ పనిలోనైనా ఉన్నత స్థితికి సంపాదించాలనే కాంక్షతో కృషి చేస్తారు. వీరికి నీరంటే ఇష్టముండదు. పై అంశాల విశ్లేషణ వల్ల ఎవరితోనైనా ఢీకొట్టే లక్షణాలు గొర్రెలో కూడా కన్పడుతుంటాయి.

**వృషభం :-** వృషభం అంటే ఎద్దు. ఈ రాశి వారు స్థిరమైన అభిప్రాయం కలవారు. పొరపాటు లేకుండా తాపీగా పని చేసి విజయం సాధిస్తారు. ఎంతటి శ్రమకైనా ఓర్చుకుంటారు. విశాలమైన ముఖం, లావైన మెడ, ఉన్నతమైన భుజాలు, పుష్టి గల శరీరం కల్గినిండుగా కన్పిస్తారు. వీరిలో ఓర్పు అధికంగా ఉన్నా కోపం తీవ్రంగా ఉంటుంది. మొదటి సగం జీవితం తరువాత స్థానచలనం అభివృద్ధి ఉంటాయి. ప్రతీపనిలో బాధ్యత వహించే లక్షణంవల్ల శ్రమకు వెనుకాడక పని చేసినందువల్ల వారితో పని చేయించుకోవడానికి ఎక్కువమంది ఇష్టపడతారు. పై అంశాలు ఎద్దు లక్షణాలను పోలి ఉండడం గమనించవచ్చును.

**మిథునం :-** భారతీయ పద్ధతిలో మిథున[illegible]తులకు సంకేతం. పాశ్చాత్య పద్ధతిలో కవలలు. ఇది ద్విస్వభావరాశి. తమ అభిప్రాయానికి తామే వ్యతిరేక ఆలోచనలు కూడా చేస్తారు. ఒక దంపతులుగాని, కవలలుగాని ఇరువురు వ్యక్తులు కదా లోకంలో ఏ ఇరువురు వ్యక్తులు ఒకే అభిప్రాయాన్ని కల్గి ఉండరు. ఏ పని చేస్తే ఏ ఇబ్బంది కల్గుతుందో అనే

సంశయం, తగవులలో న్యాయం చెప్పడం సంధిచేయడం వీరి ప్రవృత్తికి తగిన పనులు. హాస్య ప్రియత్వం, చమత్కారం వీరి మాటల్లో కన్పిస్తాయి. వీరికి మిత్రుల సహాయ ముంటుంది. రెండు వృత్తులకు సంబంధించి ఆదాయం ఉంటుంది. పై వాటిలో ద్వంద్వ వైఖరి ఉంది.

**కర్కాటకం :-** కర్కాటకం అంటే పీత. మార్గంలో ఏ మాత్రం అలికిడైనా పీతకన్నంలో దూరుతుంది. ఇతరులేమంటారో, ఏమను కుంటారో అనే భావనతో వారి ప్రవర్తన అతి జాగ్రత్తతో ఉంటుంది. ఓర్పు తక్కువ కంగారెక్కువ. కష్ట సుఖాలను తట్టుకోలేని స్వభావం. నీటి ప్రయాణాలయందు ప్రీతి. జల ప్రమాదాలకు అవకాశముంటుంది. వీరిలో ప్రేమ, కోపం, ఆశ, నిరాశ, దిగులు, ఉత్సాహం కలిసి మెలిసి ఉంటాయి. తోటలు, భూములు, దూరదేశ, వాణిజ్యం, నీటి నుంచి ఉత్పత్తి చెందే వస్తువులతో వ్యాపారం, వృక్ష ధాన్య జాతులతో వ్యాపారం రాణిస్తాయి. ఆపదలను సులువుగా దాటుతారు. ఆత్మ రక్షణా నైపుణ్యం ఉంటుంది. 35 సంవత్సరాల వయస్సులో స్థిరపడతారు. ఎదుటి వారేమనుకుంటారో అనే అతి జాగ్రత్త వలన వైవాహిక జీవన సౌఖ్యం తక్కువగా ఉంటుంది. పై అంశాలను గమనిస్తే పీతపోలికలన్నీ కన్పిస్తాయి.

**సింహం :-** మా అబ్బాయికేం సింహం. సింహంలా బ్రతకాలి అనే మాటలు వింటూ ఉంటాం. ఈ రాశి వారి ప్రవర్తన న్యాయబద్ధంగా తమ శక్తి సామర్ధ్యాలపై ఆధారపడేలా ఉంటుంది. వీరి యందు గౌరవం చేత వీరి ఎడల భయభక్తులతో ఇతరులు వీరికి లొంగి ఉంటారు. తనకు నష్టం వాటిల్లుతున్నా అవినీతిని అరికట్టడానికి వెనుకాడరు. ఎదుటి వారు తప్పు, ఒప్పుకుంటే క్షమిస్తారు. ఆశ్రయించిన వారిని రక్షిస్తారు. ఇతరుల వస్తువులును స్వీకరించరు. తమ సమస్యలను యితరులకు తెల్పరు. ఇతరుల సహకారాన్ని ఆశించరు. కీర్తికాంక్ష, అధికార వాంఛ వారికి ఎక్కువ, శత్రువులపై విజయం సాధిస్తారు. ఎదుటివారి దోషాలను ధైర్యంగా విమర్శించే స్వభావం ఉన్నందువలన వీరికి ఎదుట పడుటకు భయపడుతూ

ఉంటారు.

**కన్య :–** ఈ రాశివారికి జ్ఞాపక శక్తి అధికం. సౌమ్య స్వభావం. పరిశుభ్రత ఎక్కువ. ఇతరులను ఆకట్టుకునే ప్రయత్నాలు ఎక్కువ. ఆకర్షణ వీరి సహజ లక్షణం. గౌరవమిచ్చి పుచ్చుకోవడం, కలుపుగోలుతనం, అప్పుచేయడంలో నేర్పు, లలిత కళలందభిలాష, ప్రతీ విషయంలో సందేహం, చురుకుదనం, ఉన్న వయస్సు కన్పించకుండా చేయడం, సామాజిక నియమాల్ని గౌరవించడం, వినయం, బిడియం వీరిలో కన్పిస్తాయి. పై లక్షణాలు కన్యలో కన్పించేవే.

**తుల :–** తుల అంటే త్రాసు. ఇందులో రెండింటికీ సమానత్వం ఉంది. ఇరువురి మధ్య తీర్పు చెప్పడం, న్యాయబద్ధత, ఏ ఒక్కరి యందు పక్షపాత వైఖరి లేకపోవడం, అందర్నీ ఆకట్టు కొనేలా మాట్లాడగలగడం ఏ విషయాన్ని గూర్చి మాట్లాడినా తులనాత్మకంగా మాట్లాడడం, సమయ నియమాలు పాటించడం, లెక్కలు సరిగా చూడడం, ఆహారం, శుచిశుభ్రతలు, సౌందర్యం వాటి యందు ప్రీతి ఉంటాయి. మొదటి 30 సంవత్సరములలోపు స్థిరపడితే బావుంటుంది. పై అంశాలు త్రాసు లక్షణాల్ని పోలి ఉండడం మనం గమనించ వచ్చును.

**వృశ్చికం :–** వృశ్చికం అంటే తేలు. వీరికి నిగూఢ ప్రవర్తన పై ప్రీతి ఎక్కువ. ఏ విషయంలోనైనా తాము బయటపడకుండా ఇతరుల ప్రవర్తనను గమనించడంలో వీరికి నైపుణ్యం ఎక్కువ. ఆత్మ రక్షణ విషయంలో వీరికి ప్రజ్ఞ ఎక్కువ. తమని ఎదుటివారు ఇబ్బంది పెట్టనంతవరకు వారిజోలికి వెళ్ళరు. ఇబ్బంది కల్గిస్తే తమ మానసిక శక్తులను పూర్తిగా కేంద్రీకరించిగల శక్తి ఉంది. ఎదుటవారిలోని దోషాలను తొందరగా గుర్తించే నేర్పు కల్గి ఉంటారు. వీరు పోటీలో విజయం సాధిస్తారు. 30 సంవత్సరముల వయస్సు తర్వాత అభివృద్ధిని సాధిస్తారు. పై అంశాలు తేలు లక్షణాలను పోలి ఉన్నాయి.

**ధనుస్సు :–** ధనుస్సు అంటే విల్లు. పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు అనుకూల వాతావరణం ఏర్పడేవరకు ఎంత కాలమైనా ఓర్పు వహించగలరు. లక్ష్యాన్ని సాధించే నేర్పు, ఆపదలను అధిగమించే ప్రజ్ఞ కలిగి ఉంటారు. నచ్చని వ్యక్తులతో సంబంధాన్ని ఇష్టపడరు. లక్ష్య సాధనలో ఆటంకాల్ని లెక్క చేయరు. వీరి జీవితంలో ద్వితీయార్ధం బావుంటుంది. ప్రతి పనిలో జాగ్రత్త, ఏకాగ్రత, ధైర్యం కన్పిస్తుంటాయి. వీరు సూటిగా ప్రవర్తించినందువల్ల అందరూ విశ్వసిస్తారు. కొందరు విరోధంతో దొంగదెబ్బ తీస్తారు. పై అంశాలు ధనుస్సులోని లక్ష్యచ్ఛేదనాన్ని గుర్తు తెస్తాయి.

**మకరం :–** మకరం అంటే మొసలి. వీరికి పట్టుదల అధికం. సన్నని శరీరం, శక్తికి మించిన పనులు సాధించడానికి ఇష్టపడతారు. ఎన్ని విఘ్నాలు వచ్చినా వాటిని అధిగమిస్తారు. మార్గం సక్రమమైనా, అక్రమమైనా కార్యం సాధించే వరకు ప్రయత్నిస్తూంటారు. పైకి అమాయకంగా కన్పించినా వ్యవహారంలో సమర్థులు. ఎదుటి వారికి అనుకూలంగా ప్రవర్తించి వారిని తమ మార్గంలోకి తెచ్చుకుంటారు. వీరి సంకల్ప శక్తి గట్టిది. ఇతరుల కదలికలోని సూక్ష్మాంశాలను కూడా పసిగట్టగలరు. అలవాటు పడిన వాతావరణంలో స్థానబలంతో ఎంతటి కార్యాలైనా సాధిస్తారు. జీవితంలో 35 సంవత్సరముల తరువాత స్థిరపడతారు. పై అంశాలు మొసలి లక్షణాలను పోలి ఉంటాయి.

**కుంభం :–** కుంభం అంటే కుండ. వీరికి తెలివి తేటలు అధికం. మంచి మంచి ఆలోచనలను తనలో దాచుకోవడం వీరికి తెలుసు. ఏకాంత జీవనం అంటే ఇష్టం. అందుకని సామాన్యంగా ఇతరులతో కలవరు. ఎదుటివారు పలకరించకుండా వీరు పలకరించరు. ఆలోచనలు ఎక్కువ. పని తక్కువగా చేయటం వలన సోమరులుగా గుర్తింపబడతారు. అదృష్టం కోసం ఎదురు చూస్తూంటారు. ప్రతి చిన్న వస్తువును దాచి ఉంచుతారు, సూక్ష్మ

విషయాలలో ఆసక్తి కలిగి వుంటారు. ఎడమైన దేహం, గుండ్రని ముఖం కలిగి ఉంటారు. అధిక శ్రమ వీరి శరీరానికి పడదు. మనస్తత్వ శాస్త్రం, యోగ శాస్త్రం, ఆధ్యాత్మిక మార్గాలు వీరికిష్టం. మృధు స్వభావం, దయ, వినయం వారి లక్షణాలు. వీరికి చల్లదనం పై ప్రీతి. పై అంశాలు కుంభ రాశి లక్షణాలను పోలి ఉండటం గమనించవచ్చును.

**మీనం :-** మీనం అంటే చేపలు ఒకదాని తోక వైపు ఒకదాని ముఖంతో రెండు చేపలు ఈ రాశికి సంకేతం. పరిస్థితులకు అనుగుణంగా వీరి స్వభావం మారుతూ ఉంటుంది. ఊహలలో జీవిస్తారు. నీరంటే ఇష్టం. జలసమీప ప్రదేశాలలో నివాసం వీరి అభివృద్ధికి కారణమౌతుంది. సుకుమార భావనలు, సున్నిత ప్రవర్తన కలిగి ఉంటారు. ఇతరులలో దుర్గుణాలు కన్పిస్తే వారికి దూరంగా ఉంటారు. వీరికి వాగ్ధాటి, రచనా చాతుర్యం, ఊహా శక్తి అధికం. తమ ప్రజ్ఞతో ఇతరులకు ఆనందాన్ని, కాలక్షేపాన్ని కల్గిస్తారు. విశ్రాంతిగా ఒకచోట ఉండరు. నిరంతరం ఏదో పని చేస్తూంటారు. వృత్తి యందు గౌరవం. వీరి సలహాలు ఇతరులకు అభివృద్ధినిస్తాయి.

ఇలా నిరంతర పరిశోధన, పరిశీలన, సవరణ సూత్రీకరణల ఆధారంగా వేలాది సంవత్సరాల పరిశోధనా ఫలితంగా రాశులకు ఈ నామాలు ఏర్పడ్డాయి. జ్యోతిషంలో వాడే పదజాలం అంతా ఇలా పరిశోధనాత్మకమైంది కావడం వల్ల సామాజిక జీవనంలోని ఎన్నో రహస్యాలు గ్రహించడానికి ఈ శాస్త్రాధ్యయనం ఉపకరిస్తుంది. ప్రతి వ్యక్తి తనను, సమాజాన్ని అర్ధం చేసుకోవడానికి అభివృద్ధి పథంలో తనను తాను మలచుకోవడానికి ఈ శాస్త్రం ఉపయోగపడుతుంది.

# 8. కాలాంగాలు

కాలం, కాంతి అనే అంశాలను విశ్లేషించేదే జ్యోతిషం. కాలం అఖండమైనది. మన వినియోగం కోసం కాంతి ఆధారంగా కాలాన్ని విభజించుకుంటాం. పగలు, రాత్రి, తిధి, వార, నక్షత్రం, యోగం, కరణం, పక్షం, మాసం, ఋతువు, అయనం, సంవత్సరం, యుగం మొదలైన పేర్లతో కాల విభజన జరుగుతోంది. అన్నిటికంటే విలువైనది కాలం. పోయినదాన్ని దేన్నైయినా సాధించగలం గాని గడచిన క్షణాన్ని తిరిగి సాధించలేం. మనం ఏ పని ఏ సమయానికి చేయాలో ఆ సమయానికి చేస్తే కాలం సద్వినియోగమౌతుంది. అలా ప్రతి పనిని ఏ సమయానికి ఆరంభిస్తే కార్యం, ఆనంద ప్రదమైనదో, మంచి ఫలితాన్నిస్తుందో వివరించేది జ్యోతిషం. జాతక దశల ద్వారా ఏ సమయంలో ఏ పనికి కృషి చేయాలో తెలుసుకొని చేస్తే శ్రమ, కాలం వృధా కావు. అలా కాని సమయంలో పని చేస్తే వ్యక్తి శ్రమను, కాలాన్ని వ్యర్థం చేయడంతో పాటు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయే ప్రమాదం కూడా ఉంది. ఒకసారి ఆత్మవిశ్వాసం కోల్పోతే ఆ వ్యక్తి జీవనం వ్యర్థమయ్యే ప్రమాదం ఉంది. వేదాంతం కూడా వ్యక్తిని కృషిశీలుని చేయడానికి పనికి వస్తుంది. శ్రీ కృష్ణుని ఆధ్యాత్మిక ఉపదేశం ద్వారా అర్జునుడు క్రియాశీలతను పొంది యుద్ధం చేశాడు. అర్థం చేసుకోని వేదాంతం వల్లగాని చేసిన కృషి ఫలించక పోవడం గాని నిర్వేదం పొందిన వారిని కూడా జ్యోతిషం ద్వారా కారణాలను వివరించి తిరిగి కృషీశీలురుగా చేయవచ్చు. సరైన కాలాన్ని నిర్దేశించడానికి జాతకం, ముహూర్త భాగం కూడా పనిచేస్తాయి. వ్యక్తి యొక్క జనన కాలంలోని గ్రహాల ప్రభావం వ్యక్తిపై ప్రభావాన్ని చూపినట్లుగానే ఒక పని ప్రారంభించిన సమయంలోని గ్రహాల ప్రభావం ఆ పనిపై ఉంటుంది. అన్నప్రాశన ముహూర్త బలం అతని జీవితంలోని ఆహార సౌఖ్యాన్ని నిర్దేశిస్తుంది. ఉపనయన ముహూర్తం అతని ఆధ్యాత్మిక జీవనౌన్నత్యాన్ని నిర్దేశిస్తుంది. వివాహ ముహూర్తం వైవాహిక జీవనాన్ని నిర్దేశిస్తుంది. మంచి ముహూర్తాలలో చేసిన వివాహాలన్నీ

విజయవంతం అవుతున్నాయా అన్న ప్రశ్న ఉంది.

వేమన అంటాడు :

విప్రవరు ముహూర్త విభవమ్ము నమ్ముచు
పెద్దలనొగి గూర్చి పెండ్లి చేయ
నువిద ముండ యౌ ముహూర్తము నిజమెట్లు
విశ్వదాభిరామ వినురవేమ

నిజమే ఒకే ముహూర్తానికి వివాహం చేసిన అన్ని వివాహాలు ఒకే విధంగా ఉంటాయా? ఉండవు. భార్యాభర్తల స్వభావైక్యత జాతకాల ద్వారా చూడాలి. ఇరువురి జాతకాలలో ఆయుర్దాయ బలం చూడాలి. భౌతిక పరిస్థితులు, కుటుంబ వ్యక్తులు, వారి సహజీవనానికి సహకరించాలి. గత కాలానికి ఈ కాలానికి పరిస్థితులలో మార్పులు వచ్చాయి. వాటికి అనుగుణంగా జాతకాలు చూడాలి. గత కాలంలో పురుషునికి స్త్రీ వశురాలిగా ఉంటుంది అనే దృక్కోణంలో జాతక సమ్మేళనాలు గమనించే వారు. ప్రస్తుత కాలంలో పరస్పర భావాలు గౌరవాలు ఇచ్చి పుచ్చుకోవడాలు బాగున్నాయా! అని పరిశీలించాలి. అలాగే గతంలో కంటే వివాహ విచ్ఛేదాలు పెరిగాయి. ఇతర సంస్కృతుల ప్రభావం, అత్తమామల అత్యాశలు, వ్యక్తిలో సద్దుబాటుతనం లోపించడం, నైతిక విలువలకంటే భౌతిక విలువలకు ప్రాధాన్యం ఇవ్వడం మొదలైన సాంఘిక పరిస్థితులన్నీ దృష్టిలో పెట్టుకుంటేనే జ్యోతిష్కుడు దోషాలను అధిగమించే విధంగా ముహూర్తాది కొన్ని మేళనాలను సరి చూడగలుగుతాడు.

గోచార భాగాన్ని గూర్చి వేమన అంటాడు :

ధర గ్రహములు రాశి చరియించుచుండిన
మంచి చెడును గానిపించుచున్న
పురుషయత్నమనుచు పొంగుదురేలయా
విశ్వదాభిరామ వినురవేమ

అంటే పలు విధాల ప్రభావాలకు ప్రభావితమైన వ్యక్తి జీవనాన్ని సుఖమయం చేసుకోవాలంటే పలు కోణాలలో పరిశీలించాల్సిన అవసరం ఉంది. ఉత్తమ వైవాహిక జీవనం ద్వారా రాబోయే తరాన్ని ఉత్తములుగా తీర్చిదిద్దే అవకాశం ఉంటుంది. తల్లి ప్రేమ, తండ్రి ప్రేమ లోపించిన వ్యక్తులలో హింసాత్మక ధోరణులు, సంఘ విద్రోహ చర్యలు పెరుగుతున్నాయని పరిశోధకుల అభిప్రాయం. ప్రేమను పంచాలి. దాని ద్వారా వ్యక్తులలో సౌమ్యత పెరుగుతుంది.

ప్రాచీన సంస్కృతి అన్ని దేశాలలోను ఉంది. ఉత్తమ కుటుంబ వ్యవస్థ భారతదేశంలో ఉంది. ఆ ఉత్తమ కుటుంబ వ్యవస్థ వలననే ప్రాచీన సంస్కృతిని తరువాత తరానికి అందజేయడం సాధ్య పడుతుంది. అందువలననే భారతదేశంలో ప్రాచీన సంస్కృతీ ఛాయలు ఇంకా మిగిలి ఉన్నాయి. ఈ స్థితికి కారణం భారతీయులలో ఎక్కువ మంది వివాహ ముహూర్తానికి జాతక సమ్మేళనానికి ప్రాధాన్యం ఇవ్వడమేననక తప్పదు. ప్రస్తుత కాలంలో విదేశీయులు కూడా ఈ కుటుంబ వ్యవస్థను అభిలషిస్తూ జాతక మేళనాలపై, ముహూర్తాలపై ఆసక్తి పెంచుకుంటున్నారు. ప్రప్రథమ విజ్ఞానమైన జ్యోతిర్విజ్ఞానం మానవుని ఆనంద జీవనానికి ఇచ్చే సహకార హస్తాన్ని స్వీకరించి అర్థంకాని భవిష్యత్తును సార్థకం చేసుకోవడానికి కృషి చేయాలి.

శకునాలు వాస్తవాలా! మూఢవిశ్వాసాలా అనేది మరో ప్రశ్న. మనసు గుర్తించే వాస్తవాలకు శకునాలను కూడా ఆధారం చేసుకోవడం శాస్త్రీయమైన దృక్పథమే. చెడ్డ శకునం వచ్చినప్పుడు కూడా మనసు ధైర్యం కలిగివున్న సందర్భాలలో కార్య సిద్ధి కలుగుతూ ఉంటుంది. మనసులో శంక జనిస్తే అది కార్య విఘ్నానికి సంకేతం. మనసు సాత్విక స్థితిలో ఉన్నప్పుడు మాత్రమే ప్రయోజనాపేక్షలేని వాస్తవం గుర్తించబడుతుంది. మనస్సును సరిపెట్టుకొనే ధోరణి ఆత్మ వంచనే అవుతుంది. ఇంట్లో కుక్కను పెంచాం. ఆ కుక్క అపరిచిత వ్యక్తులు వచ్చినప్పుడల్లా అరుస్తూ ఉంటుంది.

ఆ వచ్చినవారంతా దొంగలు కారు. అంత మాత్రం చేత బద్ధకించి అది అరిచినా చూడ్డం మానివేస్తే దొంగలు వచ్చినప్పుడు కూడా ఆత్మరక్షణ కల్పించుకొనలేని వారమౌతాము. అందుచేత భయం, శంక అనే వాటిని అధిగమించే మానసిక స్థితి వలన జాతకానికి అనుకూలమైన వాతావరణం వల్ల మనస్సు పరిణతమై వ్యక్తి ఆనంద సాధన చేయగలుగుతాడు.

భారతదేశంలో ఈ విశిష్టత ఉంది. వ్యక్తి అనుభవించే అవకాశం లేని సంపదను ఆర్జించాలని ఆశించటం న్యాయం కాదు. వ్యక్తిలో సంతృప్తి ఉన్నప్పుడు ఆనందం అనుభవించ గలుగుతాడు. తాను రాణించే మార్గాన్ని ఎన్నుకుంటే దానిలో సంతృప్తి పొందగలుగుతాడు. లోకంలో మంత్రం కాని అక్షరం లేదు. మందు కాని మొక్క లేదు. పనికిరాని మనిషిలేడు. ఏది ఏ సమయంలో ఎందుకు పనికివస్తుందో తెలిసిన వాడే జ్ఞాని. సంపదను ఆర్జించడంలో కష్టం ఉంది. దానికి రక్షించడంలో కష్టం వుంది. మొత్తం ఖర్చైతే దుఃఖం ఉంది. అలాంటి సమయంలో అవ్యక్తమైన భవిష్యత్తును వ్యక్తీకరించి జ్యోతిషం ద్వారా మార్గాన్ని ఎన్నుకోగల్గుతాడు. వినియోగాన్ని ఎరిగినప్పుడే అన్ని వస్తువులు ఆనందాన్నిస్తాయి. వినియోగ పరిజ్ఞానం లేనప్పుడు అంతా చీకటి వ్యాపించినపుడు అకారణ భయం, ఆందోళన, అజ్ఞానం తప్ప సుఖముండదు. సంతృప్తి వుండదు. జ్యోతి కాంతి కాబట్టి ఆ వెలుగు రేఖలలో అవాంతరాలు, ఆటంకాలు లేని మార్గంలో పయనించి అనువైన లక్ష్యాలను మాత్రమే ఏర్పరచుకోవడం ద్వారా సుఖ జీవనం సాధ్యమవుతుంది.

కొందరు కృషి లేకుండానే అకస్మిక లాభాలను, ఆదాయాలను పొందుతూ ఉంటారు కదా! వారు అదృష్టవంతులు అని అభిప్రాయ పడుతూ ఉంటారు. కాని, తన జీవితంలో అనుభవించగల సంపద మాత్రమే అతని సొంతం. తక్కినదంతా ఎవరనుభవించవలసివుందో వారికి చెందుతుంది. తాను ఆ ధనాన్ని రక్షించడానికి మాత్రమే. ఒక ధర్మకర్త మాత్రమే. వంద కోట్లకు అధిపతి అయిన ధనవంతుని కుమారుడు తండ్రి

ఇచ్చిన వంద కోట్లను 98 కోట్లకు తగ్గించాడు. ఆ జాతకుడు తన జీవిత కాలంలో రెండు కోట్లు తగ్గించాననే ఆవేదన కలిగి ఉంటాడు. అనుభవ సౌఖ్యం లభించదు. 98 కోట్లు ఉన్నాయి కాబట్టి అతడు లోకం దృష్టిలో అదృష్టవంతుడే కాని జ్యోతిశ్శాస్త్ర రీత్యా అతడు నష్ట జాతకుడు. భారతీయ జ్యోతిర్విద్య వేదాంత శాస్త్రాన్ని, ధార్మిక నియమాలను, యోగ పద్ధతులను, ఆరోగ్య విధానాలను తనలో ఇముడ్చుకుంటూ వ్యక్తి శారీరక, మానసిక ప్రశాంతులకు మార్గాలను సూచిస్తూ ఒక సమగ్ర వ్యక్తిత్వం సాధించబడటానికి ఉపకరిస్తోంది. దానాన్ని ప్రేరేపిస్తూ ఆనందాన్ని పంచుకోవాలనే భావాన్ని సూచిస్తోంది. ఈ విధానం ద్వారా సామాజిక సమగ్రత, సమతలను కూడా ఏర్పరుస్తోంది. జ్యోతిషం సమగ్ర ఆనందాన్ని అందించే నిత్య నూతన జ్ఞాన జ్యోతి.